# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక



: చందా వివరాలు :
3 సంవత్సరాల చందా రూ. 140/-
సంవత్సర చందా రూ. 48/-
ఎయిర్ మెయిల్ (1 సం॥) రూ. 200/-
సీ మెయిల్ (1 సం॥) రూ. 100/-

చందా పంపవలసిన చిరునామా
రత్నా ఏజన్సీస్
9, దేశికా రోడ్, ఆళ్వారుపేట వద్ద
మద్రాసు - 600 004
ఫోను : 4990327

జూన్ 1994

## ఈ సంచికలో



-: ముఖచిత్రం : కలర్ ట్రాన్స్‌పరెన్సీ :-
విక్ హాండా

# ధ్యానం

## నాలుగు గుణాలతో సామరస్యం




నమ్రతాస్ఫూర్తి నుండి వినయం, శాంతి ఉద్భవిస్తాయి. ఆత్మశరణాగతి నుండి ఓర్మి, వివేకం మరియు నిజమైన తీర్పు వచ్చి చేరుతాయి. ప్రేమ నుండి దయ, ఉల్లాసం, సామరస్యం ఉద్భవిస్తాయి. దయ నుండి సాధుత్వం మరియు క్షమించే స్వభావం ఉదయిస్తాయి.

ఈ నాలుగు గుణాలతో ఎవరైతే సామరస్యం కుదుర్చుకుంటాడో అతడు పవిత్రమైన జ్ఞానాభివృద్ధి పొందినవాడవుతాడు; సౌభ్రాతృత్వాన్ని సంపూర్తిగా తెలుసుకున్నవాడు అవుతాడు. ద్వేషం నుండి, శతృత్వం నుండి, కఠినత్వం నుండి, ఖండన నుండి విముక్తి పొంది అతడు సౌభ్రాతృత్వాన్ని సంపూర్తిగా గ్రహించుకున్నాడు. చీకటి ప్రవృత్తులలో జీవించేవారు, జ్ఞానవృద్ధి కలిగించే గుణాలతో జీవించేవారు - అందరూ అతని సోదరులే. అందరిపట్ల అతని మనో వైఖరి ఒకటిగానే ఉంటుంది - అదే సద్భావం.

# సంపాదకుని పేజీ

## విజయ సాధనకై ఆశించు

ప్రపంచంలో ఏదో ఒక గొప్ప ఉపయోగకరమైన కార్యం సాధించాలనే తీవ్ర కాంక్షే - అత్యాశ. మనలో ప్రతి ఒక్కరూ జీవితంలో ఒక సముచితమైన, యోగ్యమైన అత్యాశను స్పష్టమైన మాటల్లో ప్రకటించాలి జీవితంలో యోగ్యమైన దాన్ని సాధించుకునేందుకు మనం ఎన్నో సంవత్సరాలు ముందుగా ఆశించి, పథక నిర్మాణం చేసుకోవాలి. ప్రపంచంలో జీవించేందుకు ఇది ఒక్కటి మాత్రమే మనకు బ్రతుకునివ్వ గలుగుతుంది.

అనేక అభిరుచులను జాగ్రత్తగా ఎంపిక చేసుకోండి. వీటిలోనుంచి మీరు సాధించ దలచుకున్నదేమిటో దాన్ని నిర్ణయించుకోండి. దాన్ని మీ లక్ష్యంగా చేసుకోండి. అన్ని విధాల దాన్ని సాధించేందుకు పూనుకోండి. దాని జటిలతలు మరియు సాంకేతికతలకు సంబంధించినవన్నీ నేర్చుకుంటూ మీ పనిలో నేర్పరితనాన్ని అభివృద్ధి చేసుకోండి. అత్యధిక ఆర్థిక బహూకృతులతో కూడిన ఉన్నత స్థానాన్ని సమాజంలో ఇది ఒక్కటే మీకు సమకూర్చి పెట్టగలుగుతుంది.

## భూమిపై అత్యంత తేమగల ప్రదేశం

మేఘాలయా (ఈశాన్య భారతం) లోని చిరపుంజికి 16 కి.మీ. పడమరగా ఉండే మాసిన్‌రాం - భూమి మీద అత్యంత తేమగల ప్రదేశం. ఇక్కడ వార్షిక వర్షపాతం 11,873 మిల్లీ మీటర్లు కాగా హవాయ్‌లోని వైలియేల్‌లో 11,438 మిల్లీ మీటర్లు, చిరపుంజిలో 11,314 మిల్లీ మీటర్లుగా నమోదయింది.

'ఘనంగా పరాజయం పొందేందుకు సాహసించేవారు మాత్రమే ఘన విజయాలు కూడా ఎప్పుడైనా సాధించగల్గుతారు.''

రాబర్ట్ ఎఫ్. కెన్నెడీ

అత్యాశ ఉన్నప్పుడు మాత్రమే జీవితం ప్రయోజనకరమౌతుంది. అత్యాశతో నిండి, తమ శక్తినీ, కాలాన్నీ వినియోగించి కష్టపడిన కృల పేర్లే నేడు నిల్చి ఉన్నాయి

మీ ఆశలపట్ల అత్యాశతో ఉండండి. మీ అత్యాశలు అతి అల్పమైనవి అయినట్లయితే, ఫలితాలు కూడా అతి చిన్నవిగా ఉండి, చెప్పుకోవలసినంతవిగా ఉండవు

మరో విజయవంతమైన కథను అనుబంధింప చేసుకునేందుకు ఆశతోనూ, కష్టపడి పాటు పడేటట్లుగానూ ఉండండి.

## అప్పగించటం వేరు, ...ం వేరు

*నేరారోపణ లేదా జైలు శిక్ష తప్పించు కునేందుకు పారిపోయి వచ్చిన నేరస్థుణ్ణి ఆ దేశానికి తరలించటం Extradition అంటారు. ప్రజా సంక్షే మానికి ఎవరివల్ల విఘాతం కలుగుతుందో వారిని దేశం నుండి వెళ్ళగొట్టడం Deportation అంటారు*

## భక్తి భరిత ఆనంద ప్రవాహం

*ఒక ఇంటిలోపల వెలిగే దీపం కిటికీల ద్వారా తనకాంతిని వెలుపలికి కూడా వెదజల్లుతుంది అదే విధంగా మేథ దర్పణంపై భగవంతుడు ప్రకాశించినపుడు భక్తి భరిత ఆనంద ప్రవాహం అన్ని ఇంద్రియాల ద్వారా ప్రతిఫలిస్తుంది.*

— *శ్రీ ఏకనాథ్*

## హాస్యతోరణం

### కుక్కకి కొమ్ములు!

క్లాసులో తూగుతున్న శ్యామ్రావుని లేపి, "ఏరా కుక్క అని వ్రాయమంటే 'కక్క' అని వ్రాశావ్" అని నిలవదీశాడు టీచరు

"మీరే కద సార్, కుక్కకి కొమ్ములుండవన్నారు"



### నా తలనే నేను ఊగిస్తున్నాను

ప్రపంచంలో బహుశా గొప్ప మాటకారిగా పేరొందిన విన్‌స్టన్ చర్చిల్ మంచి శ్రోత కాదు. హౌస్ ఆఫ్ కామన్స్‌లో ఒక ప్రతిపక్ష సభ్యుని ఉపన్యాసం వింటూ చర్చిల్ తన తలను కదల్చటం ప్రారంభించాడు తద్వారా ఆ సభ్యుని కంటే అధికంగా అందరి దృష్టిని ఆకర్షించాడు ఆ ప్రతిపక్ష సభ్యుడూ ఇక భరించలేక తన వ్రేలిని చర్చిల్ వైపు చూపుతూ ఇలా అన్నాడు "గౌరవ నీయుడైన నా మిత్రునికి నేను గుర్తుకు తేదలచింది - నేను కేవలం నా సొంత అభిప్రాయం మాత్రమే ప్రకటిస్తున్నాను." దీనికి చర్చిల్ ఇచ్చిన జవాబు: "ఈ ఉపన్యాసకునికి నేను గుర్తుకు తెచ్చేదేమి టంటే - నా సొంత తలనే నేను ఊగిస్తున్నాను."

**"ఒక గొప్ప వ్యక్తి చేసిన పనినే ఇతరులు కూడా చేస్తారు. అతడు ఒక ప్రమాణంగా నిలిపిన దాన్నే ప్రపంచం అనుసరిస్తుంది."**

## తయోగులు

# తులసీదాస్

డాక్టర్ రాందత్ భరద్వాజ్

మొగల్ చక్రవర్తి అక్బర్ పరిపాలనా కాలంలో (16వ శతాబ్ది) తులసీదాస్ నామ దేయం గల ఒక పుణ్య పురుషుడు, ఇట్టా జిల్లా (ప్రస్తుతం ఉత్తరప్రదేశ్‌లో ఉంది)




అలీగంజ్ పరగణాకు చెందిన సోరోన్ గ్రామ వాస్తవ్యుడు - ప్రస్తుతం రాజపూర్ నెలకొన్న జమునా నదీ తీరంలోని అరణ్య ప్రాంతానికి వచ్చినట్లు సంప్రదాయసిద్ధంగా చెప్పబడు తున్నది. తులసీదాస్ రాజపూర్ స్థాపించి, ఒక దేవాలయాన్ని నిర్మించి, అనేకమంది అనుచరుల్ని ఆకర్షించాడు.

ఇట్టా జిల్లాలోని సోరోన్‌కు తూర్పున దాదాపు రెండు మైళ్ళ దూరంలో గల రాంపూర్‌లో తులసీదాస్ పూర్వీకులు నివసించారు పరిస్థితుల ప్రభావం వల్ల అతడి తండ్రి ఆత్మారాం శుక్లా తన వృద్ధురాలైన తల్లిని, భార్య హులసిని తీసుకుని సోరోన్‌కు చెందిన యోగమార్గ మొహల్లాకు చేరుకోవలసి వచ్చింది. అతడు జన్మించిన కొన్ని మాసాల తరువాత తులసీ దాస్ తన తల్లిని కోల్పోయాడు. అచిరకాలంలో తండ్రిని కూడా పోగొట్టుకున్నాడు. అతని పోషణ బాధ్యత వృద్ధురాలైన నాయనమ్మ భుజాలపై పడింది బాలుడుగా అతడు రామ బోలా లేక రమోలా అని పిలువబడ్డాడు.

తులసి దృఢమైన ఆరోగ్యం, చక్కని ఛాయ, మంచి నడవడి గల యువకుడు. అతడు పెరిగి పెద్దవాడవుతున్న కొద్దీ పాండిత్యంలోని వివిధ శాఖలలో ప్రావీణ్యం సంపాదించాడు. దీనబంధు పథకుని పుత్రిక రత్నావళిని వివాహం చేసుకున్నాడు. తులసి పురాణ పఠనం తన వృత్తిగా స్వీకరించి, పేరు గడించాడు. ఈ దంపతులకు 'తారాపతి' అనే కుమారుడు కలిగాడు కానీ వారికి తీవ్ర దుఃఖాన్ని కలిగిస్తూ - ఎక్కువకాలం జీవించ కుండానే - మృతి చెందాడు.

1547 ఏ.డి లో వివాహానంతరం 15 ఏళ్ళకు రత్నావళి బదరిలోని తన సోదరుల ఇంటికి రక్షాబంధనం కోసం వెళ్ళవలసి వచ్చింది తులసి కూడా తొమ్మిది రోజుల పాటు తన వృత్తిపరమైన పర్యటనకు వెళ్ళాడు.

### గోల్ఫ్!

నీవు ఒక క్రీడను అవలోకిస్తుంటే,
అది ఒక వేడుక (తమాషా) నీవు
ఆడినట్లయితే, అది ఒక వినోద కాలక్షేపం.
దానిలో పనిచేసినట్లయితే, అది ఒక
విధమైన గోల్ఫ్!

"వ్యాకులం - తరచుగా ఒక చిన్నదానికి పెద్ద నీడ నిస్తుంది."
స్వీడిష్ సామెత

అయితే అతడు ఇంటికి తిరిగి వచ్చిన తరువాత తీవ్రమైన ఒంటరితనానికి లోనయ్యాడు. వరదల్లో ఉన్న గంగానదిని ఈది అతడు అర్ధరాత్రికి మామగారి ఇల్లు చేరుకున్నాడు. అటువంటి అసాధారణ సమయంలో అతణ్ణి కలుసు కున్నందుకు దిగ్భ్రాంతి చెందిన రత్నావళి తన భర్తను వరద నీటిని ఏవిధంగా దాట కలిగారని అడిగింది. తనపై అతనికి గల తీవ్ర ప్రేమను గురించి తెలుసుకున్న ఆమె ఇలా చెప్పింది: "నా ప్రాణ నాథా! మిమ్మల్ని చూడటం నాకు సంతోషం కలిగిస్తున్నది నాపై మీకు గల తీవ్రమైన ప్రేమ మీరు గంగానది దాటేటట్లు చేసింది. కనుక కచ్చితంగా భగవంతుని దివ్యప్రేమ ఎవరికైనా ఈ భౌతిక ప్రపంచం అధిగమించేందుకు సహాయపడుతుంది."

ఈ మాటలు విన్న తులసీదాస్ మేథ ఒక ఆకస్మికమైన మలుపు తిరిగింది. వైవాహిక సంబంధమైన ప్రేమ దివ్యప్రేమగా రూపాంతరం చెందింది. అతడు తక్షణమే బదరీనీ, సోరోన్‌ను కూడా విడిచి పెట్టాడు. అతడు ఒక సన్యాసిగా మారిపోయి అదృశ్యమయ్యాడు. ఎంత వెదకినా అతని జాడ దొరకలేదు. ప్రేమ విశ్వాసాలు గలది, దిక్కులేనిది అయిన రత్నావళి అన్ని సుఖాలను విసర్జించి చివరి వరకు ఒక వైరాగ్య జీవితాన్ని గడిపింది. బదరి నుండి తులసీ దాస్ విస్తృతంగా పర్యటించాడు దేశ దిమ్మరి అయిన ఒక సంగీత పాటకునిగా, కొన్ని సమయాల్లో అద్భుత క్రియలు చేస్తూ జీవితం కొనసాగించాడు. అతడు చిత్రకూటంలో, అయోధ్యలో నివసించాడు. రాజపూర్‌ను నిర్మించాడు. ఆఖరికి వారణాసిలో స్థిరపడ్డాడు. అక్కడే 1623 ఏ.డి లో తన తనువు చాలించాడు.

తులసీదాస్ రచించిన అనేక రచనలలో రామ చరిత మానస" — విశేష శాస్త్ర పరిజ్ఞానం గల గొప్ప విద్వాంసులలోనూ, సామాన్యులలో కూడా ప్రత్యేక ఆసక్తి రేకెత్తించింది. ప్రపంచ సాహిత్యంలోని అత్యంత ఉత్తమ కృతుల శ్రేణిలోకి నిస్సందేహంగా చేర్చదగిన ఒక మహాకావ్యంగా అది రూపొందింది

సంస్కృతం చదవలేని కోట్లాది ఉత్తర భారతీయులకు "రామ చరిత మానస" ద్వారా రామకథ సుపరిచితమైనది.

## విస్డమ్ పాతకాపీలు

*మే 84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84 మార్చి '85 నుంచీ జూన్ '85, ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు '86, జనవరి '87, మార్చి '87 నుంచీ మే '87, ఆగస్టు '87, డిసెంబరు '87, జనవరి '88 మార్చి '88 నుంచీ డిసెంబరు '88, జనవరి '89 నుంచీ డిసెంబరు '89; జనవరి '90 నుంచీ జూన్ '90, ఆగస్టు '90, సెప్టెంబరు '90 నవంబరు '90, డిసెంబరు '90, ఫిబ్రవరి '91 నుంచీ డిసెంబరు '91, జనవరి '92 నుంచీ డిసెంబరు '92, జనవరి '93 నుంచీ డిసెంబరు '93 కాపీలు మా వద్ద ఉన్నవి 1984 కాపీల వెల రూ 7 50లు, 1985 కాపీల వెల రూ 5'50లు, 1986 కాపీల వెల రూ 10 50లు, 1987 కాపీల వెల రూ. 10.00లు; 1988 కాపీల వెల రూ 18 75లు; 1989 కాపీల వెల రూ. 24 50లు, 1990 కాపీల వెల రూ. 23 00, 1991 కాపీల వెల రూ. 26 50లు, 1992 కాపీల వెల రూ. 33 00లు; 1993 కాపీల వెల రూ 33.00లు. రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందటానికి కాపీల వెలతో పాటు రూ. 6.00లు చేర్చి M O పంపాలి. "రత్నా ఏజెన్సీస్", 9, దేశికా రోడ్డు, (ఆళ్వారు పేట వద్ద), మద్రాసు - 600 004.*

— *సర్క్యులేషన్ మేనేజర్*

'ఒక నూతన మిత్రుణ్ణి, పాత శత్రువును నమ్మవద్దు.'



# ధార్‌లోని ఇనుప స్తంభం

ఏ.ఆర్. షెరీఫ్

మధ్యప్రదేశ్‌లోని ధార్ అనే చిన్న పట్టణంలో - కొద్దిగా నలుగురికీ తెలిసిన ప్రదేశంలో - ఒక ఇనుప స్తంభం నిల్చి ఉంది ఇది 44 అడుగుల ఎత్తు, 7 టన్నుల బరువు కల్గి ఉంది. ప్రాచీన భారతంలోని అతిపెద్ద ఇనుప



Iron Pillar (in three pieces), Dhar

స్తంభం మరియు అతిపెద్ద ఇనుప ముద్ద కూడా ఇదే. ప్రాచీనకాలంలో ఆశ్చర్యం కలిగించే ఇంత ఎత్తు, బరువు గల ఇనుప స్తంభాన్ని తయారు చేయటమే - ఒక అసాధారణ కార్యం! ఎందుకంటే కేవలం ఇటీవలి కాలంలో మాత్రమే అత్యంత అభివృద్ధి చెందిన సాంకేతిక పరిజ్ఞానంతో ఇంతటి బృహత్తరమైన స్తంభం నిర్మించ గలుగుతున్నారు.

ఈ అసాధారణమైన ఇనుప స్తంభం - జయస్తంభం లేక విక్టరీ టవర్ - గా నిర్మించ బడింది. ఇది గుప్తుల కాలానికి (300-500 ఏ.డి.) చెందినదైనా కావచ్చు లేదా మధ్య భారతాన్ని 1010-1054 ఏ.డి.లో పరిపాలించిన భోజదేవ మహారాజు కాలంలోనిదైనా కావచ్చు. ఏమైనప్పటికీ ఈ స్తంభం త వయస్సు 1000 సంవత్సరాలని చెబుతుంది ప్రస్తుతం ఈ ఇనుప స్తంభం మూడు చీలికలు విరిగిపోయింది గుజరాత్‌కు చెందిన సుల్తా బహదూర్ షా (1526-1537) ఈ బ్రహ్మాం మైన స్తంభాన్ని తన రాజధానికి తరలించేందుక ముక్కలు చేయటం జరిగిందని మొగల్ చక్రవ జహంగీర్ చెప్పాడు ఈ ఇనుప స్తంభం కిరీట కన్పించకుండా పోవటం వల్ల స్తంభ పొడవులో దాదాపు 50 అడుగులు, బరువు ఎనిమిది టన్నులు తగ్గిపోవలసి వచ్చింది.

ఈ బృహత్తర స్తంభం ఒక తునకగా పో పోయబడలేదు దుక్క ఇనుము యొక క్రమాగతమైన ముద్దలను కలగలిపి, కాచ కలియగొట్టి అతికి వేయటం జరిగింది. ఈ స్తంభంపై జరిపిన పరీక్షల ద్వారా దీని 99.60 శాతం ఇనుము, 0.28 శాతం ఫాస్ఫర మరియు 0.02 శాతం కార్బన్ ఉన్నట్లు వె డయింది. బహిర్ ప్రదేశంలో శతాబ్దాల తరబ బహిరంగంగా ఉన్నప్పటికీ త్రుప్పుపట్టకుం ఉన్నది ధార్‌లోని ఇనుపస్తంభం లోహ సంగ్రహ శాస్త్ర రంగంలో ప్రాచీన భారతీయుల సాధించిన మరొక గణనీయ విజయానికి చిహ్నం

## పాలియోబోటనీ ఇన్‌స్టిట్యూట్ స్థాపన

ది బీర్‌బల్ సహానీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పాలియో బోటనీ లక్నోలో (ఉత్తర ప్రదేశ్) నెలకొల్పబడింది

"కంటికి కన్ను అనేది - యావత్ ప్రపంచాన్ని అంధకారంలో ముంచటంతో హరవుతుంది." — గాంధీజీ

డాక్టర్ హెచ్.కె. బఖ్రూ

నారింజ - ఒక రుచికరమైన, పోషకాహార ఫలం. వ్యాసంలో 12 సెం మీ.ల వరకు పెరుగుతుంది ఇవి గాఢమైన ఆకుపచ్చ ఆకులు, సువాసన వెదజల్లే పువ్వులు కల్గి ఎల్లప్పుడూ ఆకుపచ్చగా ఉండే 12 మీటర్ల ఎత్తు గల చెట్టుకు పెరుగుతాయి




నారింజ జన్మస్థానం - దక్షిణ చైనా ప్రపంచంలోని ఉష్ణనేలలు, అత్యుష్ణ భూముల్లో ఎక్కడైనా - ఇది నేడు పెరుగుతున్నది ఇండియాలో ఇది మహారాష్ట్రలోని నాగపూర్ మరియు పూనే ప్రాంతంలోనూ, అస్సాంలోనూ, కర్ణాటకలోని కూర్గులోనూ విస్తృతంగా పెంచబడుతున్నది

నారింజను పరిశీలిస్తే వెల్లడయిన అంశాలు దీనిలో 87 6 శాతం తేమ, 0 7 శాతం ప్రొటీన్, 0 2 శాతం కొవ్వు, 0 3 శాతం ఖనిజాలు, 0 3 శాతం పీచు, 10 9 శాతం కార్బొహైడ్రేట్స్ ఉన్నాయి. ఇవి తినదగిన 100 గ్రాముల భాగంలో ఉన్నాయి ఈ పండులోని ఖనిజాలు, విటమిన్లు ఈ విధంగా ఉన్నాయి· కాల్షియం నూటికి 26 మిల్లీగ్రాములు, ఫాస్ఫరస్ 20 మిల్లీగ్రాములు, ఇనుము 0.3 మిల్లీ గ్రాములు, కరొటిన్ 1104 mcg, థయామిన్ 0 12 మిల్లీ గ్రాములు, నియాసిన్ 0 3 మిల్లీగ్రాములు, రిబోఫ్లావిన్ 0 06 మిల్లీగ్రాములు మరియు విటమిన్ సి 30 మిల్లీ గ్రాములు ఉన్నాయి వీటి కాలోరీల మూల్యం 48 దీనిలో సోడియం, పొటాసియం, మెగ్నీసియం, రాగి, సల్ఫర్ మరియు క్లోరిన్ కూడా ఉన్నది

సూర్యకిరణాల ద్వారా నారింజలోని పిండి పదార్థం (గంజి) త్వరితంగా జీర్ణమయ్యే చక్కెరగా మారిపోతుంది. తత్ఫలితంగా ఇది శీఘ్రంగా రక్తంలోకి పీల్చుకోబడుతుంది. దీన్ని ఉపయోగించిన తక్షణమే శరీరంలో వేడిమినీ, శక్తినీ ఉత్పత్తి చేస్తుంది.

అన్ని రకాల జ్వరాలకు నారింజ ఒక శ్రేష్ఠమైన ఆహారం నారింజరసంలోని ఇంపైన సువాసన,

## రసాలూరే 100 పండ్లను అందించే చిన్న మామిడి చెట్టు

*ఔరంగాబాద్ (మహారాష్ట్ర) పొలిమేరల్లోని ఖుల్తాబాద్‌కు చెందిన ఒక వ్యవసాయదారుడు - ఎ వి రణదివే - తన మామిడి పెంపకంలో ఒక ప్రత్యేక పద్ధతి ప్రవేశపెట్టాడు అతని వ్యవసాయ క్షేత్రంలో ఒక చిన్న నూతనాంకురమైన మామిడి చెట్టు మూడేళ్ళలో 100 రసాల పండ్లను అందించింది వ్యవసాయ శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం ఒక మామిడి మొలక పండ్లు కాసేందుకు కనీసం 20 సంవత్సరాలు తీసుకుంటుంది అతని వ్యవసాయ క్షేత్రంలోని అనేక మామిడి చెట్లు - బొన్సాయి మొక్కల కంటే కొంచెం పెద్దవి - పచ్చి మామిడి కాయలతో నిండి ఉన్నాయి!*

"తరచుగా ఒక మనిషి మోసే బరువు అతడు మోయ గలిగినదాని కంటే ఎక్కువగానే ఉంటుంది. కాని నీవు అతనిపట్ల శ్రద్ధ తీసుకుంటున్నట్లు ఋజువు చేయగలిగితే మాత్రం అతని బరువు తేలిక అవుతుంది."

రుచి - జ్వర రోగ పీడితులు బాధపడే టాక్సి మియా (విష పదార్థాలను ఉత్పత్తి చేసే జీవ పదార్థం)న్నూ, ఉమ్మి నీరు లేనందువల్ల ఏర్పడిన నోటి పూతనూ అధిగమించేందుకు తోడ్పడు తుంది. టైఫాయిడ్, ట్యూబర్క్యులోసిస్ మరియు మశూచికం వచ్చినప్పుడు ఇది ఆదర్శ వంతమైన ద్రవాహారంగా పనికి వస్తుంది. ఇది సత్తువను కల్గిస్తుంది మూత్ర ఉత్పత్తిని అధికం చేస్తుంది. అంటు వ్యాధుల నుండి శరీరానికి నిరోధక శక్తిని కలిగిస్తుంది. తద్వారా శీఘ్రంగా స్వస్థత పొందేందుకు తోడ్పడుతుంది.

దీర్ఘకాలపు అజీర్తికి నారింజ - శక్తివంతమైన ఔషధం. ఇది జీర్ణక్రియ అవయవాలకు విశ్రాంతి కల్గించి సులభంగా జీర్ణం చేసుకునే పద్ధతిలో పోషకాహారాన్ని సరఫరా చేస్తుంది. జీర్ణక్రియ రసాల ప్రవాహాలను ప్రేరేపించి, జీర్ణక్రియను పెంపొందించి, ఆకలిని పెంచుతుంది.

రాత్రి నిద్రకు ఉపక్రమించే సమయంలో ఒకటి లేదా రెండు నారింజ పండ్లు, అలాగే ఉదయం మేల్కొన్నప్పుడు కూడా తీసు కున్నట్లయితే ప్రేగుల పనిని ప్రేరే పించేందుకు ఉత్తమ మార్గంగా ఉంటుంది.

చనుపాలు తీసుకోని శిశువులకు నారింజ రసం శ్రేష్ఠమైన ఆహారం. వయస్సును బట్టి వీరికి ప్రతిరోజు 15 నుండి 120 మిల్లీలీటర్ల నారింజరసం ఇవ్వాలి. ఇది పొడలను, రికెట్స్ (ఎముకలను కృశింపచేసే శిశువ్యాధి) నూ అరికట్టి శరీరం పెరుగుదలకు తోడ్పడు తుంది. సాధారణ పెరుగుదల లేని పెద్ద బిడ్డలకు కూడా నారింజ రసం 60 నుండి 120 మిల్లీలీటర్ల వరకు ఇవ్వవచ్చు.

నారింజ తొక్క మొటిమలకు మరియు సాధారణ చర్మ వ్యాధులకు అమూల్యమైనది. నారింజ తొక్కను నీటితో చేర్చి రాతిపైన పొడికొట్టి చర్మంపైన పూయాలి. దీన్ని వర్ష నీటిలో తడిపి పొడి కొట్టినట్లయితే మరిం శక్తివంతంగా ఉంటుందని విశ్వసించబడుతున్నది

సాధారణంగా డిన్నర్ చివరిలో అందించె పండుగా నారింజను చూడటం జరుగుతున్నది నారింజ రసం విక్రయానికై నిలువ చేయ బడుతున్నది. స్క్వాష్ (పండ్ల రస పానీయం) మార్మలేడ్ మరియు జామ్ చేసేందుకు కూ నారింజలు ఉపయోగించబడుతున్నాయి.

## ఉపన్యసించటం వస్తువిక్రయం వంటిదే



ప్రజల ముందు ఉపన్యసించటం వస్తు విక్రయ వంటిది. సేల్స్‌మన్ వస్తువుల్ని అమ్మటమో లే మరమ్మత్తు చేయటమో చేస్తాడు. ఉపన్యాసకుడ భావాలను విక్రయిస్తాడు. కరతాళ ధ్వనులవల్ల తన విజ్ఞప్తి ననుసరించి తీసుకున్న ఓటింగ్‌వ తన ఘనతను అతడు పరీక్షించుకుంటాడు. అతని భావాలు ప్రజలకు నచ్చినట్లయితే, అతడ కోరిన విధంగా నడుచుకోవటమో, ఓ చేయటమో చేస్తారు. అప్పుడు అతని ఉపన్యాస విజయాన్ని సాధించినట్లే.

— ఆర్.సి. స్పె

"చిన్న దోషంతో ఉన్న వజ్రం అది లేని గులకరాయి కంటే మేలైనది."

## వనితలు నిజంగా అదృష్టవంతులు!

వనితలు నిజంగా అదృష్టవంతులు వారు పుట్టినప్పుడు ప్రతివారు అడుగుతారు· "తల్లి ఎలా ఉంది?", వారికి వివాహమైనప్పుడు ప్రతి వారి మాట "ఎంత అందమైన వధువు!" స్త్రీల సేవలో అఱిగిపోయి పురుషుడు మరణించినప్పుడు ప్రతివారు అడిగే విషయం "ఆమె కోసం ఏమాత్రం వదిలిపెట్టి వెళ్ళాడు?"



## సృజనాత్మకత

విషయాలను విభిన్న పద్ధతిలో చూడటం ద్వారా ఏర్పడి ఉన్న నమూనా (మాదిరులు)లను ఛేదించటంలోనే సృజనాత్మకత చిక్కుకొని ఉన్నది.

## విలక్షణ మేధ

ఒక నాగరికత గల మేధకు అత్యంత విశిష్టమైన, విలక్షణమైన గుర్తు ఏదంటే ఇతరుల ఉద్దేశాన్ని కూడా గ్రహించే సమర్థత; స్వార్థాన్ని విడనాడటం, స్వంత అభిప్రాయం కంటే విభిన్నమైన వైఖరితో జీవితాన్ని, దాని సమస్యలను వీక్షించగలగటం

## విషయాలు

ప్రపంచంలో యదార్థంగా గొప్ప విషయాలు మూడు ఉన్నాయి ఒక పర్వతం, మహా సముద్రం మరియు తన పనిని చిత్తశుద్ధితో చేసే మనిషి ప్రతి ఒక్కదాని సంభవనీయత (Potentialities) మానవ లెక్కలకు అందనిది!

## ప్రపంచ నిజ చరిత్ర

ప్రపంచ నిజ చరిత్ర ఎప్పుడైనా కొద్ది మంది చరిత్రగానే ఉంటుంది ఎవరెస్ట్ శిఖరం ఎత్తును దృష్టిలో పెట్టుకుని హిమాలయాలను మనం అంచనా వేసినట్లే, తమ మగత పురికొల్పే జీవితపు కలలనుండి ఒక్క క్షణం సేపైనా బయటపడనివారు, అక్కడే జీవించి మరణించేవారు అయిన మిలియన్ల కొద్దీ గ్రామీణుల నుండి కాక - ప్రాచీన ధర్మశాస్త్ర కర్తలనుండి, వేదాంత, సాంఖ్య తత్త్వశాస్త్ర స్థాపకులనుండి, ఉపనిషత్ జ్ఞానంగల ఋషులనుండి, వేద పండితులనుండి మనం భారతదేశపు వాస్తవిక కొలతలను తీసుకోవాలి

—ప్రొఫెసర్ ఎఫ్ మాక్స్ ముల్లర్

## అలసట తీర్చే ఔషధం - తేనె

* అలసట, ఆయాసం, సోమరితనం, మలబద్ధం - పోగొట్టేందుకు తేనె తోడ్పడుతుంది ఉపశమనం కల్గించే ప్రతినిధిగా పని చేస్తుంది

* పిల్లల ఱొమ్ము నెప్పులకు లేదా ఊపిరి భారంగా పీల్చటం జరుగుతున్నా అల్లపురసంలో తేనెను కలిపి ఇవ్వండి

— ఆర్.సి ధావర్

'పరావర్తనం చెందని పుస్తక పఠనం - జీర్ణం కాకుండా భుజించటంవంటిది."

— ఎడ్మండ్ బర్క్

## విసిగించే వ్యక్తి

విసిగించే వ్యక్తి: అతడు వినవల్సి ఉందని నీవు భావించినప్పుడు తాను మాట్లాడేవాడు.

## సమకాలీన విషాదాంతం

మానవాళిని ఏకీకృతం చేసే వివేకం సముపార్జించక ముందే అణువిచ్ఛిత్తి జరపటంలో మనం విజయం సాధించటమే - సమకాలీన విషాదాంతం

—రబ్బీ జూలియస్ మార్క్

## రెండు రకాల పుస్తకాలు

రెండు రకాల పుస్తకాలు ఉన్నాయి. ఎవరూ చదవనివి మరియు ఎవరూ చదవాలని కోరుకోనివి

## ఘనులకు కొదవలేదు

డబ్బును కాల్చేందుకు పూనుకున్నవారు ఎవరికైనా దానికి నిప్పు అంటించేందుకు కాచుకుని ఉన్నవారు ఎవరో ఒకరు తేలికగా దొరకుతారు

## అదృష్టం ప్రతివారి తలుపు తట్టుతుంది!

జీవితంలో ఏదో ఒకసారి అదృష్టం ప్రతి వ్యక్తీ తలుపూ తట్టుతుంది. అయితే అనేక సందర్భాలలో ఆ వ్యక్తి పొరుగునున్న సెలూన్‌లో ఉండి అమె పిలుపు విన్పించుకోకపోవటం జరుగుతుంది.

—మార్క్‌ట్వైన్

## హనీమూన్!

హనీమూన్ - కొత్త యజమాని దగ్గర పని చేసే ముందు ఒక వ్యక్తి తీసుకునే (విశ్రాంతి) సెలవు కాలం.

## నిఘంటువు

వివాహానికి ముందే విడాకులు వచ్చే ఏకైక స్థానం - నిఘంటువులోనే

## ప్రొఫెసర్!

ప్రొఫెసర్. తాను ప్రొఫెసర్ పట్టం పొంది, స్వయంగా తప్పించుకునేందుకు ప్రయత్నించిన జీవిత సమస్యల్ని ఏ విధంగా పరిష్కరించాలో విద్యార్థులకు బోధించవలసిన వ్యక్తి.

## చెప్పేది ఏమీ ఉండదు!

ప్రపంచంలో సగ భాగం చెప్పదగినది ఉన్నప్పటికీ చెప్పలేకపోతున్న వారితోను - మరో సగ భాగం, చెప్పేది ఏమీ లేకపోయినా, దాన్ని గురించి వాగుతూ ఉన్నవారితోనూ సమకూర్చబడి ఉన్నది.

—రాబర్ట్ ఫ్రాస్ట్

# ప్రపంచంలో పెద్ద తాబేలు

ప్రపంచంలో పెద్ద సముద్రపు తాబేలుకు ఎస్మరాల్డా అని పేరు. దీని బరువు 306 కి గ్రాలు హిందూ మహా సముద్రానికి నైఋతి దిక్కున గల ఐలీ ఆఫ్ బర్డ్స్‌లో ఇది నివసిస్తుంది

'మిషా' సౌజన్యంతో

రికాదు

## భారత భవితవ్యం

భారత భవిష్యత్తు ఇటుకలతో నిర్మించబడకూడదు - మెదడుతో తప్ప.

— ఎన్.ఏ. పాల్కీవాలా
(న్యాయశాస్త్ర కోవిదుడు)

"నిస్సందేహంగా బుద్ధి చంచలమైనది. [illegible] అయితే నిరంతర ధ్యానం మరియు [illegible]

## ఎ.జె. సింగ్

ఈర్ష్య - మానవుని సంతోషాన్ని ధ్వంసం ేస్తున్నది. కేవలం అజ్ఞానం ఫలితంగా వచ్చేదే ఈర్ష్య సదవగాహన ద్వారా మనం దీని ప్రభా ము నుంచి బయటపడ కల్గుతాము.



ఇలా తీవ్రవేదన పడుతున్న వ్యక్తిలో ఏదో పొరపాటు ఉన్నదని తెలియజెప్పే ఒక నిశ్చయమైన సూచన - ఈర్ష్య మనం ఈర్ష్యకు వశమైనామని త్వరగా గ్రహించుకో గలిగిన వెంటనే ఈ వ్యాధికి మూలం కనుగొనేందుకు మన మెదడును అన్వేషింపజేయాలి. ఈర్ష్య (అసూయ) ప్రేమను ప్రకటించటమని భావించేవారు పూర్తిగా పొరపడినట్లే. ప్రేమ, అసూయ అనేవి రెండు విభిన్న వైఖరులు. వాస్తవానికి ఈర్ష్య ఎక్కడ ఉంటుందో ప్రేమ అక్కడ వర్ధిల్లదు. వివాహాన్ని ఈర్ష్య మాత్రమే గట్టి పరుస్తుందని భావించేవారు - రెండో భాగస్వామిని బయటికి వెళ్ళ గొట్టేందుకు ఇది నిశ్చయ మార్గమని తెలుసుకోవాలి.

నీ భాగస్వామిని నీవు సొంతం చేసుకున్నావనే భావన యొక్క ప్రత్యక్ష ఫలితమే - ఈర్ష్య ఇటువంటి ఆలోచన ఒక భ్రాంతి మాత్రమే ఎవరూ ఎవరినీ సొంతం చేసుకోలేరు ప్రపంచ ప్రఖ్యాత మానవ శాస్త్రవేత్త డాక్టర్ మార్గరెట్ మీడ్ అభిప్రాయం ప్రకారం అనేక మంది దంపతులకు వివాహం అంటే అర్థం ఎప్పుడూ కలసి ఉండటం, కలసి పనిచేయటం (ఒక భాగస్వామికి దీనిలో సంతోషం లేకపోయినా) ఆధిపత్యానికి మరోపేరు 'కలసి ఉండటం ఇదే ఈర్ష్యను పెంచుతుంది.

నీవు ఒక వ్యక్తిని "సొంతం" చేసుకుంటే అతడు కానీ, ఆమె కానీ మీ సంపదలో మరి ముక్క మాత్రమే అవుతారు దీనివల్ల తేలికగా అర్థమయ్యేదేమిటంటే రెండవ వ్యక్తికి వ్యక్తిగతమైన గుర్తింపు లేదనీ, అతడు యజమానిని మించి ఏమీకాడని తెలుస్తుంది. ఇటువంటి భావధోరణి అసహజమైనది కనుకనే ఈర్ష్య ప్రవేశిస్తుంది, వృద్ధి పొందుతుంది

తన భాగస్వామిని కోల్పోతున్నాననే భయం వల్లనే ఒకరిలో ఈర్ష్య పుట్టుకొస్తుంది. ఇక

*ప్రపంచంలో ఎక్కువ దేశాలతో (16 దేశాలు భూసరిహద్దులున్న దేశం చైనా. ఉత్తర కొరియ రష్యా తజకిస్తాన్, కిర్గిజ్‌స్తాన్, కజకస్తాన్, మంగోలియ ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, ఇండియా, నేపాల్, భూటాన్ మియాన్మార్ (బర్మా), లావోస్, వియత్నాం, మకావ్ హాంకాంగ్ దేశాలతో చైనాకు భూసరిహద్దు ఉంది*

ప్రేమించిన వారి విషయంలో, రెండవవ్యక్తి అనురాగాన్ని పొందే అద్వితీయ స్థానాన్ని, గురుతర స్థానాన్ని ఇకముందు తాను ఆక్రమించ లేననే భయంవల్లనే ఈర్ష్య ఏర్పడుతుంది.



ఒకే సమయంలో ఒక వ్యక్తిని మాత్రమే ప్రేమించగలుగుతామనే పొరపాటు నమ్మకం వల్ల ఈర్ష్య ఉద్భవిస్తుంది. కనుక ఒక భాగస్వామి మరోవ్యక్తి అభిమానాన్ని చూరగొంటే రెండో భాగస్వామి పట్ల అతని ప్రేమ తగ్గినట్లు భావించటం జరుగుతున్నది

మనం ఎందుకు ఈర్ష్యాళువులమౌతున్నాము? అదొక స్వాభావిక ప్రవృత్తి. మనం దానితోనే పుట్టాము. తల్లీ తండ్రీ మధ్యగల సంబంధం గుర్తించిన బిడ్డ తనను వదలి వేశారని భావిస్తుంది. అలా ఈర్ష్యకు చెందిన మొదటి వ్యథ అనుభవిస్తుంది. కొన్నేళ్ళ తరువాత బాలబాలికలు జటిల భావాన్ని పెంపొందించు కుంటారు. బాలిక తన తల్లిపట్ల, బాలుడు తన తండ్రి పట్ల ఈర్ష్య వహిస్తారు. వారి తల్లిదండ్రులు ఒకరినొకరు ప్రేమించుకోవటమే దీనికి కారణం.

ఒక మనస్తత్వ శాస్త్రవేత్త ఆల్‌బర్ట్ ఎలిస్ అభిప్రాయం ప్రకారం ''యాజమాన్యం'' అనే భావం కలిగేందుకు వివాహ ఒప్పందం బాధ్యత వహిస్తుంది. నీవు ఒక వ్యక్తితోనే ముడిపడి ఉండాలనే అభిప్రాయం కలిగి స్తుంది. ఈ విశ్వాసమే ఈర్ష్య అభివృద్ధి చెందేందుకు నేరుగా తోడ్పడుతుంది.

నీవు ఈర్ష్య నుండి బయటపడేందుకు కొన్ని చర్యలు తీసుకోవాలి. ఈర్ష్యకు సంబంధించిన నవలను ఉమ్మడిగా చదవడం, పార్టీలలో ఈర్ష్యాళువుల వైఖరి గమనించటం, వీరిని గురించి వార్తాపత్రికలలో చదివి నీ భాగస్వామితో చర్చించడం - ఈర్ష్య నుండి బయటపడేందుకు ఉత్తమమార్గాలు

నీలో నీకు విశ్వాసం ఉండాలి నీకులేని అన్నిగుణాలు నీవిరోధికి ఉన్నాయనే కారణం వల్లనే సాధారణంగా ఈర్ష్య తలెత్తుతుంది. నీకంటే ఆమె అన్నివిధాల అధికురాలనే అభిప్రాయం కూడా దీనికి కారణమౌతుంది. తన ప్రత్యర్థి యొక్క - నిరోధించలేని అందం వల్ల తన పురుషుడు జయించబడ్డాడని ఒక స్త్రీ భావించవచ్చు. తన ప్రత్యర్థికి విజయం అతని శారీరక ఆకర్షణ కారణంగా లభించిందని ఒక పురుషుడు భావించవచ్చు. కనుక నీ అంతర్గత విశ్వాసాన్ని అభివృద్ధి చేసుకుని, నీకు అధికంగా ఉన్న ప్రత్యేక లక్షణాలను పెంపొందించుకోవటం అవసరం. ఈర్ష్యకు ప్రతిగా నీవు చేసుకునే రక్షణ ఏర్పాట్లకు ఇది అండగా నిలుస్తుంది.

— ''హర్యానా రివ్యూ'' సౌజన్యంతో

''తమ పాపాలకు క్షమాపణలు కోరేవారే మీ పాపాలను - ఏవైనా ఉంటే - క్షమించేందుకు తిరస్కరిస్తారు.''

## సురక్షితమైన మంచినీరు

దాదాపు 1.2 బిలియన్ ప్రజలు సురక్షితమైన మంచినీటి సదుపాయాన్ని పొందలేక పోతున్నారు

## 3 మిలియన్ శిశువుల మృతి



రక్షణ ద్వారా నివారించ గలిగిన వ్యాధుల వల్ల ప్రతి సంవత్సరం దాదాపు 3 మిలియన్ మంది శిశువులు మృతి చెందుతున్నారు.

## సంవత్సరానికి 1 మిలియన్ స్త్రీల మరణం

నిరోధించ గల్గిన పునరుత్పత్తికి సంబంధించిన ఆరోగ్య సమస్యల వల్ల ప్రతి సంవత్సరం ఒక మిలియన్ మంది స్త్రీలు మరణిస్తున్నారు.

## చదవలేరు, వ్రాయలేరు

1 బిలియన్ వయోజనులు చదవలేరు, వ్రాయలేరు.

## అదృశ్యారణ్యాలు

ప్రతి సంవత్సరం దాదాపు 17 మిలియన్ హెక్టార్ల మేరకు అరణ్యాలు అదృశ్యమౌతున్నాయి.

## పలచన అవుతున్న ఓజోన్ కవచం

కేవలం కొన్ని సంవత్సరాల క్రితమే శాస్త్రజ్ఞులు భావించినంత త్వరితగతిలో రక్షిత ఓజోన్ కవచం రెండురెట్లు పలచన అయిపోయింది.

## ప్రపంచ జనాభా పెరుగుదల

సంవత్సరానికి ప్రపంచ జనాభా 92 మిలియన్ మేరకు పెరుగుతున్నది. ఇంచుమించుగా ప్రతి సంవత్సరం మరో మెక్సికోను జనాభాకు కలుపుతున్నట్లే

## ప్రతిరోజు నశించే మొక్కలు, జంతుజాతులు

ప్రతిరోజు అథమపక్షం 140 మొక్కలు మరియు జంతుజాతులు పనికి రానివిగా నిర్ణయింపబడి నశించిపోతున్నాయి.

## పాఠశాలల్ని చూడని పసివారు

ప్రాథమిక పాఠశాలలకు వెళ్ళే వయస్సు గల 100 మిలియన్‌కు పైగా పిల్లలు పాఠశాలలకు వెళ్ళటం లేదు

## ఇండియాలో మొదటి గైరోకాప్టర్

*బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో ఇండియా మొదటి గైరోకాప్టర్ నిర్మించబడింది. "నగ్నంగా" ఇది హెలికాప్టర్‌ను ప్రతిబింబిస్తుంది. ఇది ఒక విమానానికి, ఒక హెలికాప్టర్‌కు 'సాంకర్యం' గా ఉంటుంది.*

"ఆశావాది పిండి ముద్దను చూస్తే నిరాశావాది రంధ్రాన్ని చూస్తాడు."

కె.ఎస్.ఎన్. మూర్తి

ఇండియాలో సరీసృపాలు - ప్రాకే జంతువులు లేదా అల్లుకుని మెల్లగా పోయే జంతువులు - ఇంకా నిర్లక్ష్యం చేయబడుతూనే ఉన్నాయి దీనికి కారణం, వీటి రహస్య మనుగడ రీతి, ఇవి ప్రమాదకరమైనవి లేదా విషపూరితమైనవి అనే మనిషి యొక్క హేతురహితమైన పొరపాటు అభిప్రాయం సరీసృపాలు అనేక సూక్ష్మమైన, పరోక్ష పద్ధతుల ద్వారా మానవాళికి సేవ చేస్తున్నాయని మనలో చాలామందికి తెలియదు.



మరణించిన, రోగగ్రస్థమైన చేపలను తినటం ద్వారా మొసళ్ళు మన తటాకాలను, నదులను పరిశుభ్రం చేస్తున్నాయి. మరోవిధంగా ఆరోగ్య భంగం కల్గించగల అనేక రోగగ్రస్థమైన, గాయపడిన జంతువులను ఇవి స్వాధీనం చేసుకుని భక్షిస్తాయి ఇదేవిధంగా మంచినీటి తాబేళ్ళు అవయవాలు గల మృతప్రాణులను భక్షించటం ద్వారా జలచరమైన పరిసరాలను

బుష్యం నుండి రక్షిస్తాయి. అనేక రకాల సూక్ష్మక్రిముల్ని అత్యధిక సరీసృపాలు భక్షించి - మనిషి నిల్వ చేసుకున్న ఆహారపదార్థాలను లేదా నారలను ధ్వంసం చేయకుండా చీడ పురుగుల నుంచి రక్షిస్తాయి. మానిటర్ (పెద్ద సరీసృపాలు పారిశుద్ధ్యం పనివారి వలే మనకు సహాయపడతాయి ఎండ్రకాయలు, పీతలు పేడపురుగులు, నత్తలు వంటి కొబ్బరి చీడలు మరియు పంటలను నాశనం చేసే ఉడతలను ఎలుకలను సరీసృపాలు నాశనం చేస్తాయి ఎలుకలను, చిట్టెలుకలను నాశనం చేసే పాములలోని కొన్ని రకాలు - మానవులకు ఉపయోగకరమైనవి.

ప్రాచీనకాలం నుండి మనిషి సరీసృపాలను తన వ్యాధుల చికిత్సకు బాధానివారణకు స్వలాభానికి ఉపయోగించుకుంటున్నాడు మానిటర్స్‌లోని జిగట కొవ్వు వృద్ధుల కంటి దృష్టి దెబ్బ తింటున్నప్పుడు చికిత్సగా ఉపయోగిస్తున్నారు. త్రాచుపాము కాటు నుండి రక్షించే గరళం కూడా విషసర్పం నుంచి పిండుతారు. ఒక బ్రతుకును ఆర్పే విషమే ఆ బ్రతుకును నిలబెడుతుంది కూడా.



## ప్రపంచంలో అతి చిన్న శునకం

*ఒకటి నుంచి ఆరు పౌండ్లు బరువు తూగేది, కాంతివంతమైన కళ్ళుగలది, శక్తి శాలి అయిన మెక్సికో - చిహుఆహువా - ప్రపంచంలోని అతి చిన్న శునకం. దీని రంగు (లేతరంగు) నలుపు నుంచి చాకొలెట్, తెలుపుల్లో ఉంటుంది ఈ శునకం ఆకర్షణీయంగా, త్వరితంగా కదిలేదిగా ఉంటుంది. ఇవి తరచుగా సాహసమైన ముఖవైఖరిని ప్రదర్శిస్తుంది.*

"మీరు ఒక సంవత్సరానికి ప్రణాళిక వేసుకుంటే [illegible] నాటండి
ప్రణాళిక పదేళ్ళకు వేసుకుంటే - చెట్లు నాటండి వందేళ్ళ
పథకం వేసుకుంటే - మానవాళికి విద్య గరపండి." — [illegible]

# సుప్రసిద్ధ భారత మహిళలు

జి.ఎం. జగ్‌తియాని

ప్రాచీన కాలంలో లేదా మధ్యకాలంలోని భారత స్త్రీలు వివాహానికి ముందు తమ తండ్రులకు, వివాహానంతరం తమ భర్తలకు, మాతృత్వం వహించిన తర్వాత తమ కుమారులకు బానిసలని చెప్పటం యదార్థం కాదు



RANI LAKSHMI BAI

ప్రాచీన ధర్మశాస్త్ర నిర్మాత - మనువు - స్త్రీని ఒక బానిసగా తక్కువ స్థానంలోకి నెట్టాడనే అపకీర్తి పొందాడు. తన "మనుస్మృతి"లో అతడు చెప్పిన మాటలను మనం మర్చిపోయాము. అతడు ఇలా చెప్పాడు "ఎక్కడ స్త్రీలు గౌరవించ బడతారో, అక్కడ దేవతలు సంతృప్తి చెందుతారు. ఎక్కడ వారు అగౌరవించబడతారో, అక్కడ మతసంబందమైన కర్మలన్నీ (అచార విధులన్నీ) నిష్ప్రయోజనాలవుతాయి ''

మనువు ఇంకా ఇలా చెప్పాడు "భార్య భర్త చేత గౌరవింపబడి తీరాలి." మనువు స్త్రీలను అత్యంత గౌరవభావంతో చూశాడని మనం మర్చిపోకూడదు. అతడు ఇలా చెప్పాడు: "గర్భిణీ స్త్రీలు, పెండ్లి కుమార్తెలు మరియు కన్యలు - అతిథులకంటే ముందుగా భోజనం చేయాలి." మనువు మాదిరిగా ఏ ప్రాచీన ధర్మ నిర్ణయకర్త స్త్రీల హక్కుల గురించి ఇంతటి వాగ్ధాటితో చెప్పాడు?

రాణి కైకేయికి వ్యతిరేకంగా రామాయణం ఏమి చెప్పినప్పటికీ, అసమాన ధైర్య సాహసాలు గలది - ఈ వీరవనిత. తన భర్త దశరథుని తరువాత యుద్ధ రంగంలో తన సాహస కార్యాన్ని ప్రదర్శించింది.

గుర్రా మహారాణి దుర్గావతి అక్బర్ యొక్క ఆశలు, కుట్రలు, పన్నుగడలపై పోరాటం జరిపి తన శిశువు హక్కులను రక్షించుకున్నది గాయపడిన పులివలే పోరాడి ఎందరో సేనాధిపతులను అధిగమించింది.

1857లో జరిగిన భారత స్వాతంత్ర్య పోరాట సమయంలో ఝాన్సీకి చెందిన రాణీ లక్ష్మీబాయ్ తన తీవ్ర విరోధి సర్‌హగ్ రోజ్ నుండి "ధైర్యంగల ఉత్తమ పురుషుడు"- అని ఒక ఈర్ష్యా ద్వేషాలతో కూడిన ప్రశంస పొందింది.

ప్రాచీన భారతంలో స్త్రీలు నిర్వహించిన పాత్రకు బృహదారణ్యకోపనిషత్తు - ఒక తగిన యోగ్యతా పత్రం అది ఇలా చెబుతున్నది· "స్త్రీ పురుషుల కలయిక వల్లనే జీవితం సంపూర్ణమౌతుంది స్త్రీ పూర్తి చేసే పాత్ర నిర్వహణ ద్వారా పురుషుని జీవితం పరిపూర్ణమౌతుంది."

వాజసనీయ బ్రాహ్మణం కూడా ఇలా చెప్పింది. "పురుషునిలోని సగ భాగమే స్త్రీ." ఒక పురుషుడు

"ఇతరులకు కష్టమైన దాన్ని తేలికగా చేయగల్గటం - సామర్థ్యానికి చిహ్నం. అసాధ్యమైనది సామర్థ్యంతో చేయగలగటం అసాధారణ ప్రతిభాశాలిత్వం."
— అమియల్

స్త్రీకి సమర్పించిన అత్యంత శ్రేష్ఠమైన నివాళి ఇదే.

మన చరిత్రలో స్త్రీ పురుషునితో సమానమైన స్థానం అలంకరించింది గార్గి - ఒక విదుషీమణి అనేకమంది పండితులను, విద్వాంసులను కఠినమైన వాదనల్లో ఓడించి, వారిని లజ్జా భరితుల్ని చేసింది. తార ఎంతో వివేకవతి అనేకమంది ప్రతిభావంతులు ఆమె పదునైన చమత్కారానికి, బుద్ధి కుశలతకూ ఓడిపోయి ఆమె ముందు కంపించిపోయేవారు.

అందరిచేత వదలి వేయబడిన - తన భర్తల చేత కూడా - ద్రౌపది కౌరవుల ఆస్థానంలోకి అవమానకరంగా ఈడ్చుకు రాబడినప్పుడు - ఆమె నిర్భయంగా అక్కడ సమావిష్టులైన కులీనుల్ని, వివేకవంతుల్ని ఇలా అడిగింది, "పాచికల ఆటలో నా భర్తలు తాము ఓడిపోయినంత మాత్రాన తనను కూడా పందెం కాసేందుకు వారికి ఏమి హక్కు ఉంది?" ఇది యుక్తమైన ప్రశ్నే, దీనికి ఆ మహా విద్వాంసులనుండి, గొప్ప యుద్ధ వీరులనుండి సమాధానం లేదు!

యుద్ధ భూమిలో తన భర్త చెంత నిల్చినప్పుడు ఒక మోకాలును కోల్పోయిన రాణి విశ్పల కంటి రెప్పను అల్లల్లార్చటం కానీ, అశ్రుబిందువు రాల్చటం కానీ చేయలేదు. పురుషులకంటే ఆమె అసమానమైన సాహసవంతురాలు

మహిళా దేశభక్తురాండ్రు ప్రదర్శించిన అనేక సాహస కార్యాల గాథలతో భారత స్వాతంత్ర్య ఉద్యమం అలంకృతమైనది ఇద్దరు యువతులు - బెంగాల్‌కు చెందిన సరళాదేవి చౌధురాణి, బసంతీదాస్ - శక్తివంతమైన బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా గొప్ప పోరాటం నిర్వహించారు. బీనాదాస్ (తరువాత బీనా భౌమిక్‌గా పేరొందింది), కలకత్తాకు చెందిన ఒక పట్ట భద్రురాలైన యువతి. తన కళాశాల వార్షిక స్నాతకోత్సవంలో బెంగాల్ గవర్నర్ సర్ స్టాన్లీ జాక్సన్‌ను బహిరంగంగా సవాల్ చేసింది ఈ పని చేసినందుకు పట్టుబడి, అరెస్టయి, దీర్ఘకాలం కారాగారవాస శిక్షకు గురైంది.

గాంధీజీ ఉద్యమాలు భారత స్త్రీలను ముందు భాగానికి తీసుకు వచ్చాయి వారి సంకెళ్ళు బ్రద్దలు కొట్టాయి

స్త్రీలలో మన దేశంలో ఉన్నంత మంది మంత్రులు, పార్లమెంట్, శాసన సభల సభ్యులు, దౌత్యవేత్తలు, న్యాయమూర్తులు, కార్మికోద్యమ నాయకులు - ప్రపంచంలోని మరే దేశాల్లో ఉన్నారు? నిస్సందేహంగా - యునైటెడ్ స్టేట్స్ యూరోపియన్ దేశాల్లోని కార్యాలయాల్లో మహిళా కార్యదర్శులు ఎక్కువ మంది ఉంటే ఉండవచ్చు కానీ ప్రధాన ప్రశ్న ఏమిటంటే - మన దేశంలో మాదిరిగా - న్యాయశాఖ మరియు నీతిశాస్త్రం, రాజకీయాలు మరియు దౌత్యనీతి, విదేశీ వ్యవహారాలు, యుద్ధం వంటి నిర్ణయాత్మకమైన ప్రధాన శాఖలు - ఎన్ని దేశాలు తమ స్త్రీలకు ఇవ్వటం జరిగింది? ఇండియాలో వలే ప్రపంచంలోని ఏదేశం కూడా - అభివృద్ధి చెందిన దేశం కానీ, వర్ధమాన దేశం కానీ - ఇంతటి భావ స్వాతంత్ర్యం, కదలిక (చలనం), వృత్తి (పని) బదిలీ, విధాన నిర్ణయం, ఒప్పందాలపై సంతకాలు చేయటం - వంటివి తమ స్త్రీలకు ఇవ్వలేదు.

## అర్థాలే వేరులే

*ఒక దౌత్యవేత్త 'అవును' అని చెబితే "కాబోలు" అని అర్థం అతడు "కాబోలు" అని చెబితే "లేదు" అని అర్థం. అతడు "లేదు" అని చెప్పితే - అతడు దౌత్యవేత్త కాడు!*

**"ప్రధానంగా సుదీర్ఘంగా నడిచే అలవాటు మాత్రమే ఇంగ్లండ్‌లో నేను నివసించిన కాలంలో - నన్ను వ్యాధుల నుంచి కాపాడింది, నాకు చక్కని దృఢ శరీరాన్ని అందించింది." — గాంధీజీ**

# మహాత్ముని బంగారు ...

ఆత్మార్పణకు, స్వచ్ఛతకు నిలయం 'నప్పుడు స్త్రీకి విలువ లేదు.

హక్కులకు వాస్తవమైన మూలాధారం - కర్తవ్య ర్వహణం. మనం మన కర్తవ్య నిర్వహణ సినట్లయితే హక్కులు పొందేందుకు ఎంతో ారంలో ఉండము మన విధులు నిర్వర్తించ ండా హక్కుల కోసం పరుగెత్తినట్లయితే వి మనల్ని దాటి పోతాయి. మనం ఎంతగా ాటిని వెంబడిస్తే అవి అంత త్వరితంగా గిరిపోతాయి.




మీరు పుస్తకాలు పఠించవచ్చు కానీ అవి మ్మల్ని ఎక్కువ దూరం తీసుకెళ్ళలేవు. లోని ఉత్తమత్వాన్ని బయటికి తేవటమే జమైన విద్య అన్పించుకుంటుంది. మానవత్వం అనే పుస్తకం కంటే వేరొక ఉత్తమ గ్రంథం ఏమి ఉంటుంది?

ప్రపంచం ఆధిపత్యం వహించిన పటిష్ఠ ంతమైన శక్తి - ప్రేమ. మరియు అది నయం గల కల్పనా రూపము. ప్రేమ ఎక్కడ ఉంటుందో, దేవుడు కూడా అక్కడే ఉంటాడు

జీవితంలో స్వచ్ఛమైనవి మరియు ధార్మికమైనవి అయిన వాటన్నిటికీ స్త్రీలు ప్రత్యేక సంరక్షకులు స్వభావరీత్యా మితవాదులైనందువల్ల, మూఢాచారాలను విడనాడటంలో ఆలస్యం చేస్తారు. అలాగే జీవితంలో స్వచ్ఛమైనవి, గంభీరమైనవి వదిలి పెట్టేందుకు కూడా ఆలస్యం చేస్తారు

ఎవరైతే చిఱునవ్వుల్ని ధరించరో వారు పూర్తిగా దుస్తులు ధరించినట్లు కాదు.

ఒక అభివృద్ధి చెందిన కంఠం నుండి ఉత్తమ సంగీతం సృష్టించే కళను అనేకమంది సాధించవచ్చు కానీ ఒక స్వచ్ఛమైన జీవితమనే మధురస్వరము నుండి అటువంటి సంగీతకళను పెంపు చేయటం చాలా అరుదుగా జరుగుతుంది

అన్ని కళల కంటే జీవితం గొప్పది. పరిపూర్ణత్వానికి చేరువ కొచ్చిన జీవితం గల మానవుడే అత్యంత గొప్ప కళాకారుడని నేను ప్రకటిస్తాను. సౌజన్యతగల జీవితం యొక్క గట్టి పునాది లేని కళ ఏమిటి?

మన ప్రార్థన హృదయ పరిశీలన కోసం. భగవంతుని మద్దతు లేకుండా మనం నిస్సహాయులమని మనకు అది గుర్తు చేస్తుంది. దాని వెనుక భగవంతుని దీవెన లేనట్లయితే ఉత్తమమైన మానవ ప్రయత్నం కూడా నిష్ఫలమౌతుంది.

— 'మీరా' సౌజన్యంతో

"భీరువులు తమ మరణానికి ముందుగా ఎన్నో చావులు చస్తారు. కానీ పరాక్రమశాలి ఒకసారే మరణిస్తాడు." — షేక్స్పియర్

డా. వి. చొక్కలింగం

ప్రతివారి హృదయ పరిమాణం (సైజు) వారి సొంత పిడికిలి అంత ఉంటుంది ఇది దాదాపు 350, 400 గ్రాముల బరువు ఉంటుంది. ఇది పుట్టుకకు పూర్వమే కొట్టుకోవడం ప్రారంభించి మనం జీవించినంతకాలం విశ్రాంతి లేకుండా పనిచేస్తూనే ఉంటుంది నిమిషానికి 72 సార్లు గుండె కొట్టుకుంటుంది




ఇక ఒక గంటలో, ఒక రోజులో, ఒక మాసంలో, సంవత్సరాలకాలంలో ఎన్ని సార్లు గుండె కొట్టుకుంటుందో నీవు ఊహించుకోవచ్చు. మయోకార్డియం అని పిలువబడే గుండె కండరాలకు సరఫరా చేసే రక్తనాళాల ద్వారా ఆక్సిజన్‌ను రక్తం మోసుకుని పోవటం వల్లనే హృదయ చలనం జరుగుతుంటుంది

గుండె కండరాలకు ఆక్సిజన్ అవశ్యకత మరియు కరొనరి ధమనులకు ఆక్సిజన్ సరఫరా - ఆరోగ్యాన్ని ఎప్పుడూ క్రమపద్ధతిలో ఉంచుతుంది. వ్యాయామం, ఉద్రేకం (భావావేశం), తిండి వగైరాలనుబట్టి గుండెకు ఆక్సిజన్ ఆవశ్యకత పెరుగుతూ ఉంటుంది ఆక్సిజన్ సరఫరా కూడా నిష్పత్తి ప్రకారం పెరుగుతుంది ఆక్సిజన్ యొక్క ఆవశ్యకత, సరఫరా క్రమపద్ధతిలో లేకపోయినట్లయితే, అది గుండెపోటుకు దారి తీస్తుంది కరొనరీ దమనుల లోని ఆటంకం వల్ల ఇది ప్రధానంగా జరుగుతుంది దీని ఫలితంగా మయోకార్డియంకు రక్తం సరఫరా తగ్గిపోతుంది

ప్రాథమిక దశలో హృద్రోగం - అంగినా పెక్టోరిస్‌గా వ్యక్తమౌతుంది ఇది మధ్య భాగంలో లేక ఎడమవైపు వచ్చే తీవ్రమైన గుండె నొప్పి అనంతరం ఈ వ్యాధి పెరుగుతున్న కొద్దీ ఇది మయోకార్డియల్ ఇన్‌ఫార్‌క్షన్ లేదా గుండెపోటుగా పరిణమిస్తుంది

"గుండెపోటు" - అన్ని రకాల హృదయ పరిస్థితులలోనూ అత్యంత సాధారణంగా వచ్చే వ్యాధి. హైపర్‌టెన్షన్‌తో బాటు ఇది దాదాపు 90 శాతం గుండె జబ్బులను సృష్టిస్తుంది వర్ధమాన దేశాలలోనూ మరియు అబివృద్ధి చెందిన దేశాలలోనూ మానవులను చంపే వ్యాధులలో ఇది అగ్రస్థానంలోకి వస్తుంది

## ప్రపంచంలో కోసిన పెద్ద వజ్రం

*ప్రపంచంలోని అతి పెద్దదైన కోసిన వజ్రం - దిస్టార్ ఆఫ్ ఆఫ్రికా నెంబర్- 1 కుల్లినన్ వజ్రం నుంచి కోయబడింది 530 2 మెట్రిక్ కారట్స్ బరువుగల ఈ వజ్రం ప్రస్తుతం బ్రిటిష్ (రాయల్) రాజచిహ్నంలో ఉన్నది*

"మానవునికి గొప్ప అవసరం మరియు మానవునికి గొప్ప రక్షణ విద్యకాదు - ప్రవర్తన (స్వభావం) మాత్రమే."

— హెర్బర్ట్ స్పెన్సర్

ఈ వ్యాధి రావటానికి అనేక కారణాలు బాధ్యత వహిస్తాయి. ప్రధానమైనవి, ముందుగా రోగాన్ని ప్రోత్సహించే అపాయకర కారణాలివి. 1 అధిక రక్తపు పోటు, 2. అతి మూత్ర వ్యాధి, 3. పొగత్రాగటం, 4 స్థూల శరీరం, 5 రక్తంలో అధిక కొలెస్టరాల్ (కొవ్వు), 6. స్థలం విడిచి కదలని జీవితం, 7. మానసిక ఉద్రిక్తత - మొదలైనవి.



వంశ పారం పర్యం - కూడా ప్రధాన పాత్ర వహిస్తుంది. కొన్నేళ్ళ క్రితం 50 సంవత్సరాల క్రింది వయస్సు గల వారిలో గుండెపోటు రావటం అరుదుగా ఉండేది కానీ ప్రస్తుతం ఇది సర్వసామాన్యమైంది. 25 నుండి 30 ఏళ్ళవారికి కూడా గుండెపోటు వస్తున్నది. పురోగమిస్తున్న నాగరికత, జీవితంలో ఒత్తిడి, శ్రమ, పరిసరాలకు అనుగుణంగా సర్దుకుపోలేక పోవటం, పొగ త్రాగటం, మద్యపానం వంటి చెడు అలవాట్లు మొదలైనవి - దీనికి ప్రధాన కారణాలు.

పొగాకు ధూమంలో నైట్రొజన్ మరియు ఆక్సైడ్స్, కార్బన్ మొనాక్సైడ్, కార్బన్ డయాక్సైడ్, నీటి ఆవిరి వంటి దాదాపు 270 సేంద్రియ మిశ్రమాలు (organic com pounds) ఉంటాయి అత్యంత ప్రధానమైన, మరుకైన సేంద్రియ మిశ్రమం - నికోటిన్. పొగాకును అనేక రకాలుగా ఉపయోగిస్తారు. సిగరెట్, చుట్ట, పైప్‌ల ద్వారా లోనికి పీలుస్తారు. పొగ త్రాగని వారికంటే పొగత్రాగేవారిలో గుండెపోటు 5 నుండి 8 రెట్లు ఎక్కువగా ఉంటున్నది.

పొగ త్రాగటంతో కలిసి - ఉండే నికోటిన్ అడ్రినల్ మెడుల్లా మరియు మయోకార్డియం నుండి అడ్రినలీన్ మరియు నాన్ అడ్రినలీన్‌లను సేకరించి పెడుతుంది. ఇది హృదయ చలనాన్ని పెంచుతుంది రక్తపుపోటు, కార్డియక్ ఉత్పత్తి ప్రమాణాన్ని పెంచుతుంది. తద్వారా మయో కార్డియల్ ఆక్సిజన్ డిమాండ్‌నూ పెంచుతుంది. ఇది మయోకార్డియల్ బాధను పెంపు చేస్తుంది. ఇది వెంట్రిక్యులర్ అపరిపక్వ నాడీ స్పందనలను, వెంట్రిక్యులర్ టాక్‌కార్డియాను ప్రేరేపిస్తుంది. ఆకస్మిక మృతి కలిగిస్తుంది అదే సమయంలో కరొనరీని సంకుచితం చేసి మయోకార్డియంకు ఆక్సిజన్ సరఫరాను తగ్గిస్తుంది నికొటిన్ రక్తంలో క్రొవ్వు ఆమ్లాల పెంపుదలకు స్వేచ్ఛనిస్తుంది సెరమ్ కొలెస్టరాల్‌ను, బ్లడ్ సుగర్‌ను మరింత గట్టిపర్చి, పేరబెట్టటాన్ని పెంపొందిస్తుంది. పొగ త్రాగటం వల్ల హృద్గ్రహం (Angina) వస్తుంది దీన్నే "టొబాకో ఆంగినా" అని పిలుస్తారు. ఇది సత్వర గుండెపోటును, తరువాత వచ్చే గుండెపోట్లను ప్రోత్సహిస్తుంది. కనుక పొగాకును ఒక విషపుమందుగా భావించి నిషేధించటం జరగాలి.

గుండెపోటు ఈ క్రింది విధంగా రూపొందు తుంది రోగి గుండెలో ఏదో అడ్డంకి ఉన్నట్లు భావించవచ్చు రొమ్ము ఎముక వెనుక, రొమ్ము మధ్య భాగంలో, గట్టిగా అదిమినట్లు, నొక్కినట్లు, అణచినట్లు, గుండెనొప్పి ఉండవచ్చు. ఈ నొప్పి సాధారణంగా - శ్రమపడటం వల్ల అధికంగా భుజించటం వల్ల, భావోద్రేకం చెందటం వల్ల - ప్రోత్సాహం పొంది - 5 నుండి 10 నిమిషాల వరకు కానీ లేదా గంటల తరబడి

"నా కంటి గ్రుడ్లను పెకిలించండి, అవి నన్ను చంపలేవు. నా ముక్కు కత్తిరించండి, అది నన్ను చంపలేదు. భగవంతునిలో నా విశ్వాసాన్ని పేల్చివేయండి; నేను మరణించినట్లే." — మహాత్మాగాంధీ

కానీ ఉంటుంది ఇది ఒక్కొక్కసారి ఎడమ భుజం, వీపు, కడుపు, మెడ, దవడలకు వ్యాపిస్తుంది నెప్పితో బాటు - చమట పట్టటం, మైకం, గుండె వేగంగా కొట్టుకోవటం మరియు శ్వాసక్రియలో ఇబ్బందులు ఏర్పడటం - జరుగుతుంది

హృద్రోగికి తొలి 3 నుంచి 5 రోజులు - అత్యంత ప్రమాదకరమైన కాలం కనుక - ఏ హాస్పిటల్‌లోనైనా ఇన్‌టెన్సివ్ కార్డియాక్ కేర్ యూనిట్‌లో చికిత్స పొందాలి. ఇక్కడ నాడీస్పందన, రక్తపు పోటు, శ్వాసక్రియ, మరియు గుండె పనితీరు - గురించి ఎడతెగకుండా ముందు జాగ్రత్తలు తీసుకుంటారు వీరికి ఆక్సిజన్, ప్రశాంతి కలిగించే మత్తుమందు ఇస్తారు. గుండెకు ప్రత్యేకమైన మందులు ఇస్తారు ఈ సమయంలో వీరికి పూర్తిగా శారీరక, మానసిక విశ్రాంతి అవసరమౌతుంది

ఈ క్లిష్ట పరిస్థితి తరువాత, వీరిని ఇన్‌టెన్సివ్ కేర్ యూనిట్ నుండి రోగికి కేటాయించబడిన వార్డ్‌కు తరలిస్తారు అక్కడ కనీసం మూడు వారాలు ఉంచుతారు ఆస్పత్రినుంచి విడుదల కాగానే కనీసం మూడువారాల పాటు పూర్తి విశ్రాంతి తీసుకోవాలి వారి హృదయస్థితికి అనుకూలంగా ఉన్నట్లయితే అప్పుడు తమ పనిలో నిమగ్నమయ్యేందుకు అంగీకారం పొందుతారు గుండెకు రక్తం సరఫరా చేసేందుకు, రక్తనాళాలు మరింతగా కుంచించుకుపోకుండా కాపాడేందుకు, హృదయం యొక్క కార్యకలాపాలను క్రమబద్ధం చేసేందుకు - గుండె (జబ్బు) మందులు ప్రధానంగా పనిచేస్తాయి.

గుండెపోటు వచ్చిన రోగులు నెయ్యి, వెన్న, జున్ను కొబ్బరినూనె, గ్రుడ్డులోని పచ్చసొన, గింజలు (విత్తులు), మీగడ, పెద్ద చేపలు, కాలేయం, మెదడు మరియు మూత్రపిండాలను తీసుకోవటం మానివేయాలి. వీరు ఆకుపచ్చని కూరలు, కూరగాయలు, ఉల్లిగడ్డలు, వెల్లుల్లి, సన్నని చేపలు, గ్రుడ్డులోని తెల్లసొన తీసుకోవచ్చు. వేయించిన ఆహారం కంటే ఉడకబెట్టిన ఆహారపదార్థాలు వీలైనంతవరకు తీసుకోవటం మంచిది

వంట వండేందుకు నువ్వుల నూనె మరియు ప్రొద్దు తిరుగుడు చెట్టు నూనె ఉపయోగించవచ్చు ఈశాకసంబంధమైన నూనెలు క్రొవ్వు చేరకుండా అరికట్టటమే కాక రక్తంలో వృద్ధి అయిన క్రొవ్వును కూడా అరికడతాయి

కడుపునిండా ఎవరూ తినకూడదు ప్రతి భోజనం తరువాత 45 నుంచి 60 నిమిషాలపాటు విశ్రాంతి తీసుకోవాలి. పడుకున్న భంగిమనుంచి లేవగానే ఒక నిమిషం సేపు కూర్చోవాలి. బరువైన వస్తువులను మోయరాదు. మెట్లు ఎక్కేటప్పుడు నెమ్మదిగా ఎక్కాలి. ఎందుకంటే అప్పుడు గుండె కనీసం 10 రెట్లు ఎక్కువగ పనిచేయాలి గనుక పొగ త్రాగటం, అధిక మానసికాందోళన స్థితి, మధుమేహం, స్థూల శరీరం, రక్తంలో అధిక కొలెస్టరాల్ వీటిని ముందుగానే అదుపు చేసుకున్నట్లయితే గుండెపోట్లు రాకుండా కాపాడుకోవచ్చు

— ఎం.ఎం.ఎ. బులిటెన్

## ఆరోగ్య సూచనలు

* సాయంకాలం కానీ మధ్యాహ్నం కానీ పాదరక్షలు కొనండి ఆ సమయంలో పాదాలు వెడల్పుగా సాగి ఉంటాయి

* మీ పాదాలు తేలికగా అలసటకు లోనైతె ఒక కుర్చీలో కూర్చొని కాళ్ళను తిన్నగా చాపి, పాదాలను (మీముందు) పట్టుకుని ఉండండి. రెండు మార్గాలలో నెమ్మదిగా చక్రం వలే వాటిని చుట్టండి

"మూర్ఖులకి వివేకం బోధించడం వృథా శ్రమ;
బొగ్గుని ఎంత కడిగినా తెల్లబడదు."

-కబీరు

## ప్రపంచంలో అరుదైన తపాలాబిళ్ళ

1856 లోని మగెంటా బ్రిటిష్ గుయానాపై విడుదల చేసిన 1 సెంట్ బ్లాక్ - ప్రపంచంలోని అరుదైన తపాలాబిళ్ళ. ఇది 1980 ఏప్రిల్ 5 న న్యూయార్క్ (యుఎస్ ఏ)లో 850,000 డాలర్లకు విక్రయించబడింది.

## చంద్రునిపై మొట్టమొదటి రోబోట్ వాహనం



1970 నవంబర్ 10 న యుఎస్ఎస్ఆర్ - లూనా 17 - వ్యోమ శకటాన్ని చంద్రునిపై యాత్రకు పంపింది. ఈ వ్యోమశకటం మీద మొదటి చంద్రుని రోబోట్ వాహనం - లునా ఖోడ్ - 'మూన్ వాకర్' ఉన్నది. ఇది "సీ ఆఫ్ రెయిన్స్" పైన నిలవగా చంద్రుణ్ణి అన్వేషించేందుకు రిమోట్ కంట్రోల్ ద్వారా ఈ వాహనాన్ని నడిపించటం జరిగింది

## 12 టన్నుల వృషభ ఏనుగు

భుజాల వరకు 13 అడుగుల 2 అంగుళాల ఎత్తు, 12 టన్నుల బరువు కల ఒక ఆఫ్రికన్ వృషభ ఏనుగు 1955 నవంబర్ 13 న మక్యుస్సోకు వాయవ్య దిశగా 48 మైళ్ళ దూరంలో కాల్చి చంపబడింది 1959 మార్చి 6 న ఇది వాషింగ్టన్ డి సి (యునైటెడ్ స్టేట్స్) లోని స్మిత్ సోనియన్ ఇన్‌స్టిట్యూషన్‌లో భద్రపర్చబడి ప్రదర్శించబడింది

## వాద్యపరికరానికి లభించిన అత్యధిక మొత్తం

1884లో తయారు చేసిన ఒక పియానో 1981 లో న్యూయార్క్ (యు.ఎస్.ఎ) లో 390,000 డాలర్లకు వేలం వేయబడింది. ఒక వాద్య పరికరానికి బహిరంగ వేలంలో చెల్లించిన అత్యధిక మొత్తం ఇదే. ఈ పియానోను లారెన్స్ అల్మా టడేరా రూపొందించాడు

## అతి చిన్న పడవ

హ్యూగో ఎస్ విహెలెన్ యాజమాన్యంలో "ది ఏప్రిల్ ఫూల్" అనబడే తెరచాప పడవ (5 అడుగుల 11$^7/_8$ అంగుళాలు) అట్లాంటిక్ సముద్రంలో ఇంతవరకు ప్రయాణం చేసిన అతిచిన్న పడవగా పేరొందింది. 1968 లో ఈ పడవ 85 రోజుల్లో అట్లాంటిక్‌లో అటు నుంచి ఇటు ప్రయాణించింది

## నమ్మలేని నిజాలు

### పేరులోనే పెన్నిధి

*ఇజ్రాయిల్ (పశ్చిమాసియా) లోని ఒక చిన్న గ్రామం పేరు - మాగ్దాలాను తమ పేరుగా 7 మిలియన్ స్త్రీలు పెట్టుకున్నారు. జీసస్ క్రీస్తు శతాబ్దాల పూర్వం నడిచిన ఈ గ్రామం పేరు మీదుగా - మాగ్దలీన్, మాడలిన్, మడిలన్, మర్లేని - మొదలైన పేర్లు రూపొందాయి.*

"స్వార్థాన్ని మర్చిపోవటమన్నది స్నేహానుభూతిలోనే సాధ్యమవుతుంది."

—ఫర్గాజ్

## పసిఫిక్ సముద్రంలో పడవ నడిపిన ప్రథమ వ్యక్తి

1974 లో స్వీడెన్‌కు చెందిన - తెడ్లతో పడవ నడిపే ఆండర్స్ స్వెడ్‌లండ్ పసిఫిక్ మహా సముద్రంలో పడవ నడిపిన ప్రథమ వ్యక్తిగా రూపొందాడు. దీనిని సాధించేందుకు అతనికి 118 రోజులు పట్టింది

## ఏకకాలంలో నిర్విరామంగా సాగిన చదరంగం పోటీ

1979 మే 14 న స్విట్జర్లాండ్‌కు చెందిన గణిత శాస్త్ర విద్యార్థి వార్నర్ హక్ ఏకకాలంలో నిర్విరామంగా సాగిన చదరంగం పోటీలో పాల్గొని ప్రపంచ రికార్డు స్థాపించాడు లుసెర్న్ (స్విట్జర్లాండ్)లో 25 గంటల్లో 560 మంది ఆటగాళ్ళతో పోటీపడి 385 గేముల్లో విజయం సాధించాడు, 126 గేముల్లో డ్రా అయ్యాడు, 49 గేముల్లో ఓడిపోయాడు

## ఇండియా రెండవ ఉపగ్రహం

ఇండియా రెండవ ఉపగ్రహం - బాస్కర - భూమి పరిశీలన కోసం ప్రయోగించిన ఉప గ్రహం - సోవియెట్ యూనియన్‌లోని ఒక కాస్మోడ్రోం నుండి 1979 జూన్‌లో ప్రయోగించారు

## మొదటి మానవ గుండె మార్పిడి శస్త్రచికిత్స

సౌత్ ఆఫ్రికాలోని కేప్‌టౌన్ గ్రూట్ షుర్ హాస్పిటల్‌లో 55 సంవత్సరాల వయస్సు గల లూయిస్ వాష్‌కన్‌స్కీకి ప్రొఫెసర్ క్రిస్టియన్ ఎన్. బర్నార్డ్ నాయకత్వంలోని 30 మంది వైద్యుల బృందం మొదటి గుండె మార్పిడి శస్త్రచికిత్స జరిపారు 1967 డిసెంబర్ 3న ఉదయం 1 00 నుండి 6 00 గంటల వరక ఈ గుండె మార్పిడి శస్త్ర చికిత్స జరిగింది దీన్ని ప్రసిద్ధ శస్త్ర వైద్యుడు జరిపినా, రో 1967 డిసెంబర్ 21న మరణించటం జరిగింది

## 9 గాలన్లు పట్టే టీపాట్

9 గాలన్లు పట్టే ఒక టీపాట్ (290 కప్పులు) 4 అడుగుల $9^1/_2$ అంగుళాల చుట్టుకొలత కలిగి, 47 lbs బరువు కలది - 1971 జులై విల్ట్‌షైర్ (ఇంగ్లండ్) లోని కోర్షంలో తయార చేయబడింది

## మొదటి క్రాస్‌వర్డ్ పజిల్

1913 డిసెంబర్ 21న "న్యూయార్ వరల్డ్" ఆదివారం అనుబంధంలో మొదటి క్రాస్‌వర్డ్ పజిల్ ప్రత్యక్షమైంది. 1969 7,347 చదరాలు మరియు 1,628 క్లూల (సంకేతాలు) గల ఒక క్రాస్ వర్డ్ పజిల్ మూడు ఆఫ్రికన్ వార్తా పత్రికలలో ఒక పూ పుటలో ప్రచురించబడింది.

## సాపేక్ష సిద్ధాంతం

ప్రసిద్ధ శాస్త్రవేత్త అల్బర్ట్ ఐన్‌స్టైన్ తన "జనరల్ థియరీ ఆఫ్ రెలటివిటీ" ని 1915 డిసెంబర్ 16 న ప్రచురించాడు

## వికెట్ కీపర్ గ్రేట్ ప్రతిభ

*ఆస్ట్రేలియన్ వికెట్ కీపర్ వాలీ గ్రేట్ మొదట తరగతికి చెందిన క్రికెట్‌లో అత్యధిక సంఖ్య వికెట్స్ ఇన్నింగ్స్‌లో సాధించాడు 1959 - 60 సీరిస్‌లో షెఫ్ఫీల్డ్ షీల్డ్ కోసం బ్రిస్‌బాన్‌లో వెస్టర ఆస్ట్రేలియాకు వ్యతిరేకంగా క్వీన్స్‌లాండ్ కోసం 8 మంది బ్యాట్స్‌మెన్‌ను అతడు చేజిక్కించుకున్నాడు*

**"పాతకలప బాగా మండుతుంది; పాత ద్రాక్షరసం చాలా రుచిగా ఉంటుంది; పాత స్నేహితులు నమ్మదగ్గవారు; పాత పుస్తకాలు చదవదగ్గవి."**

**—బేకన్**

మహేంద్ర సారస్వత్

రాచ ఉసిరిక లేక ఆమ్ల ఫలం (ఇంగ్లీషులో గూస్‌బెర్రీ) - విటమిన్ సి విలువలతో నిండి ఉంటుంది. సంస్కృతంలో ఆమ్లఫలం శ్రీఫలం అని పిలువబడుతుంది



ఉసిరిక ఇండియా అంతటా విస్తృతంగా పెరుగుతుంది. ప్రాచీన భారత వైద్యులు వివిధ వైద్య ఔషధాలలో దీన్ని ఉపయోగించే వారు. క్షయ, బలహీనత, బరువు కోల్పోవటం, మరియు గాస్ట్రో - ఇన్‌టెస్టినల్ వైరుధ్యాలకు శక్తివంతమైన చికిత్సగా ఇది ఉపయోగపడుతుంది. ఊరగాయలు, షర్బత్తు మరియు శాంద్ర తయారీలో ఆమ్లఫలం ఉపయోగించబడుతుంది.

గర్భిణీ సమయం మొత్తంలో క్రమంగా విటమిన్ 'సి'ని ఉపయోగించినట్లయితే జంటువ్యాధుల నుంచి నివారణ కల్గించటమే కాక ఇనుమును గ్రహించుకునేందుకు తోడ్పడుతుంది కూడా మానసిక అనారోగ్యంలో విటమిన్ సి, చికిత్స తీక్షణతను క్రమేణా తగ్గించటమే కాక భ్రాంతి, భ్రమలు తరచుగా వచ్చే పరిస్థితిని కూడా తగ్గిస్తుంది. రోగి శాంతంగా ఉండి బాగా నిద్రించేందుకు తోడ్పడుతుంది.

ఆమ్ల ఫలాలను క్షయవ్యాధుల్లో ఉపయోగించటం - ఇండియాలో ప్రాచీన కాలం నుంచి వస్తున్న ఒక చికిత్సా విధానం. విటమిన్ 'సి' రోగ లక్షణాలపై తీవ్రమైన ప్రభావాన్ని చూపుతుంది. చరకుడు తన గ్రంథం "చరక సంహిత"లో హృద్రోగాలకు ఆమ్ల రసం సక్రమమైన ఔషధంగా వ్రాశాడు. విటమిన్ 'సి' గుండె కండరాల మృదు కర్తవ్య నిర్వహణకు తోడ్పడుతుందని పరిశీలనలో వెల్లడయింది. Ischaemia of heart,

## మగమనిషి మెదడు బరువు పెరుగుదల



*1806లో సగటు మగమనిషి మెదడు 1372 గ్రాముల బరువు ఉండగా అది నేడు 1424 గ్రాములకు పెరిగిందని రికార్డులు చెబుతున్నాయి*

"దేవుడు మనుషుల్ని నిలువెత్తు నీళ్ళలో ఎందుకు ముంచుతాడంటే, ఊపిరాడకుండా చేసేందుకు కాదు; పరిశుభ్ర పరిచేందుకు."

కరోనరీ లేక మయోకార్డియల్ గుండె కలతలకు చికిత్సగా ఇది ప్రధాన పాత్ర వహిస్తుంది.

ఆస్థ్మా, బ్రాంకైటిస్, పొడ, మధుమేహం, అనీమియా, ఇన్ఫ్లూయెంజా, రొంప, జుట్టు ఊడటం మరియు నెరవడం, మానసిక ఆందోళన, ఒత్తిడి వంటి అనేక వైద్య సంబంధమైన సమస్యలలో ఆమ్లఫలం తోడ్పడుతుంది. ఒక టేబిల్ స్పూన్ తేనె, ఒక టేబిల్ స్పూన్ ఆమ్ల రసం కలిపి మిశ్రమం చేసి ప్రతి ఉదయం త్రాగినట్లయితే పైన చెప్పిన సమస్యల పరిష్కారానికి తోడ్పడుతుంది కంటి చూపు 'పాదుకునేందుకు, కళ్ళ కలక, గ్లూకోమాల చికిత్సకు ఈ టానిక్ రోజుకు రెండుసార్లు ఉపయోగించాలి

ఒక టేబిల్ స్పూన్ ఆమ్లరసం - ఒక కప్పు తాజా కాకరకాయ రసంలో కలిపి కొన్ని నెలల పాటు రోజుకు ఒక పర్యాయం తీసుకున్నట్లయితే మధుమేహాన్ని అదుపు చేస్తుంది బ్లడ్ సుగర్‌ను తగ్గిస్తుంది అనీమియా, బలహీనత, అంటు వ్యాధులను అరికడుతుంది. మధుమేహంలో వచ్చే నేత్రావరోధాన్ని కూడా అరికడుతుంది. ఒక వారం రోజులపాటు రోజుకు రెండుసార్లు ఒక టేబిల్ స్పూన్ ఆమ్లరసం, ఒక కప్పు కొబ్బరి పాలు కలిపి త్రాగినట్లయితే ఏలిక పాముల్ని, కొక్కి పురుగుల్ని తొలగిస్తుంది కళ్ళ కలకను నయం చేసుకునేందుకు ఆమ్ల రసాన్ని వెలుపలి పూతగా వాడవచ్చు.

ఈ పోషకాహార విలువల నిధి అయిన ఆమ్ల ఫలాన్ని ఉపయోగించటం ద్వారా మనం మంచి ఆరోగ్యం, దీర్ఘాయువు సమకూర్చే మార్గంలోకి ప్రవేశిస్తాము

—'హెల్త్ హెరాల్డ్' సౌజన్యంతో

## కామిక్స్




*కామిక్ చణుకులు లేక చణుకుల కార్టూన్లు ప్రపంచంలో వార్తాపత్రికలు, మాగజైన్లలో ప్రచురింపబడి పాఠకుల దృష్టిని తక్షణమే ఆకర్షించడం జరిగి ప్రజాదరణ పొందాయి. ప్రస్తుతం కామిక్స్ ఒక కొత్త కళా విధానంగా గుర్తించబడింది. గృహంలో సినిమాలు, సాహిత్యం మధ్యలో కామిక్స్ తమ సొంత భాష సృష్టించుకునే పనిలో విజయం సాధించాయి మాటలు, చిత్రాల కలయికతో ఇది జరిగింది. 1992 మే 25న తన ప్రసిద్ధ కామిక్ దృశ్యాలు ఉన్న మూడు తపాలా సెట్లను స్విట్జర్లాండ్ విడుదల చేసింది 90 సి విలువ కలవి - ఒక పూర్తి స్థాయి కామిక్స్‌లోని స్వైరకల్పనా రూపాలను ప్రదర్శించాయి*

*— కబితా రాయ్*

## “మంచు అగ్ని పర్వతాలు”

*సౌరమండల వ్యవస్థలోని సుదూరపు గ్రహం యురేనస్ (వరుణ గ్రహం) యొక్క ఐదు ఉపగ్రహాలలో “మంచు అగ్ని పర్వతాలు” ఉన్నాయి ఈ అగ్నిపర్వతాల నుండి మంచు తటాలున ప్రేలి పైకి ఎగరటంలో ఘనీభవించి, భూమి ఉపరితలంపై ఇవి హిమ (మంచు) బంతుల మాదిరిగా రాలిపడతాయి.*

*— ''మిషా'' సౌజన్యంతో*

# క్విజ్

1 ఈ క్రింది రాష్ట్రాలలో ఎక్కడ నహవా షివా పోర్ట్ స్థాపించబడింది?
(ఎ) గుజరాత్, (బి) కర్ణాటక, (సి) ఒరిస్సా, (డి) మహారాష్ట్ర.



2 ఓనం పండుగ జరిపే రాష్ట్రం:
(ఎ) ఒరిస్సా, (బి) అస్సాం, (సి) కేరళ, (డి) మణిపూర్

3 ఇండియా మొదటి సాధారణ ఎన్నికలు జరిగిన సంవత్సరం:
(ఎ) 1947, (బి) 1949, (సి) 1952, (డి) 1955

4. ఈ క్రింది వాటిల్లో వాణిజ్య పంట ఏది?
(ఎ) గోధుమ, (బి) వరి, (సి) మొక్కజొన్న, (డి) చెఱకు

5 ఈ క్రింది వాటిల్లో ఇండియా జాతీయ పక్షి ఏది?
(ఎ) పావురం, (బి) చిలుక, (సి) నెమలి, (డి) గ్రద్ధ.

6 ఈ క్రింది వాటిల్లో దేనిలో ఆకుపచ్చ విప్లవం - ఇండియాలో - అత్యంత విజయం సాధించింది?
(ఎ) వరి మరియు గోధుమ, (బి) గోధుమ మరియు బంగాళాదుంపలు, (సి) ఆవాలు మరియు నూనెగింజలు, (డి) టీ మరియు కాఫీ.

7 1971 లో పాకిస్తాన్‌తో యుద్ధం జరిగిన సమయంలో భారత సైన్యాధిపతి ఎవరు?
(ఎ) కె ఎస్ తిమ్మయ్య (బి) ఎస్ హెచ్ ఎఫ్ జె. మానెక్‌షా, (సి) కుమార మంగళం, (డి) ఏ.ఎస్ వైద్య

8 ఇకెబాన జపానీయుల కళారూపం:
(ఎ) ఆధునిక చిత్రకళ, (బి) మొక్కల పెంపకం, (సి) ఫ్రీస్టైయిల్ కుస్తీ, (డి) పుష్పాలంకరణ ఏర్పాటు.

# ప్రభుత్వాధికారం


Gandhiji

*"నేను ప్రభుత్వాధికారం పెరగటాన్ని ఎంతో భయంతో వీక్షిస్తాను బయటికి స్పష్టంగా దోపిడీని తగ్గించేందుకు మంచిదనిగా కన్పించినా - ప్రగతి మొత్తానికి మూలాధారం వంటి వ్యక్తిత్వాన్ని నాశనం చేయటం ద్వారా ఇది మానవాళికి హాని కలిగిస్తుంది."*

— మహాత్మాగాంధీ

"సాన్నిహిత్యం పెరగడంతో ఎడ్మిరేషన్ వన్నగిల్లుతుంది." —ఎడిసన్

## మాటల మహిమ

1 నికాయము: (ఎ) ఇల్లు, (బి) తెగ, (సి) లక్ష్యము/ప్రోగు, (డి) పరమాత్మ
2. నిదాఘము (ఎ) దప్పిక, (బి) వేసవి, (సి) వేడిమి, (డి) చెమట
3 నితంబము. (ఎ) పిఱుదు, (బి) ఆడుది, (సి) మొల/మూపు, (డి) కొండనడుము/దరి
4 నిరసనము: (ఎ) తిరస్కారము, (బి) ఆక్షేపము, (సి) వధము, (డి) ఉమ్మియుట
5. నభము: (ఎ) ఆకాశము, (బి) శ్రావణ మాసము, (సి) మేఘము/వర్షాకాలము, (డి) ముక్కు
6. నాళీకము: (ఎ) తామర, (బి) బాణము, (సి) చల్ది భోజనము, (డి) బాణపు ములికి.
7 నిగమము: (ఎ) వేదము, (బి) అంగడివాడ, (సి) పట్టణము/మార్గము, (డి)సంకెల
8 నిర్యాణము: (ఎ) ముక్తి (బి) నాశము, (సి) సుఖము, (డి) నీళ్లమునిగినది (ఏనుగు)

## తెలివికి పరీక్ష

1. పాశ్చరైజేషన్ అంటే ఏమిటి?
2 అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థలో (IMF) సభ్యదేశాల సంఖ్య ఎంత?
3 ఆంధ్రప్రదేశ్‌లో నదులను పోషించే ఋతుపవనాలేవి?
4 మనదేశంలో మొదటి సినిమా హాలు ఎప్పుడు, ఎక్కడ నిర్మించారు?
5 పులికాట్ సరస్సు ఎక్కడ ఉన్నది?
6 ఒక సుప్రసిద్ధ నటీమణి వ్రాసిన తెలుగు పుస్తకానికి 1993 జాతీయ స్థాయి చలన చిత్ర పుస్తక రచనలో బహుమతి లభించింది. ఆ రచయిత్రి ఎవరు? ఆ పుస్తకం పేరేమిటి?

(జవాబులకు వ పేజీ చూడండి)

## [illegible] కలిగి ఉండాలి



నా జీవిత నిబంధనలు ఇవి. కష్టించి పని చెయ్యటం, అంగీకృతమైన పరిధి వరకు అభినయించటం, ఇతరుల మంచీ చెడూ అభిప్రాయాలను సమంగా అలక్ష్యం చేయటం, మిత్రునిపైన నీచమైన యుక్తి పన్నక పోవటం, దేనిపైన కూడా ఆగ్రహం, అసూయ ప్రదర్శించకపోవటం, అవకాశం ఉన్నంత వరకు ఆ క్షణాన్ని తనదిగా చేసుకుని జీవించటం, జీవితం పట్ల ఎల్లప్పుడూ తృప్తి కలిగి ఉండటం, తనపై తనకు తృప్తి లేకుండా ఉండటం

— జార్జి జీన్‌నాథన్

## పుత్రోత్సాహం

క్లాస్ పేపర్లు దిద్దిన తరువాత టీచర్ విద్యార్థితో ఇలా రిమార్క్ చేశాడు, "తన హోంవర్క్‌లో ఇన్ని తప్పులు ఒక వ్యక్తి ఎలా చేయగలిగాడో నాకు బోధపడటం లేదు"

క్షణం ఆగి విద్యార్థి జవాబిచ్చాడు: "ఇది ఒకరే చేసింది కాదు; దీనికి మానాన్న కూడా సహాయపడ్డాడు"

"సామర్థ్యం ఉండగానే సరిపోదు - అవకాశం కలిసి రావాలి." —నెపోలియన్

# చారిత్రక స్మారక చిహ్నం -

డా.వై.ఏ.రైకర్

ఢిల్లీలోని కుతుబ్‌మీనార్ ఐదంతస్తుల శిఖరం. 72.5 మీటర్ల ఎత్తులో ఉంటుంది. ఇది పైకి పోతున్న కొద్దీ పరిధి తగ్గిపోతూ ఉంటుంధి. ప్రస్తుతం లెక్కించగా వచ్చిన 360 మెట్లు మీదుగా మీరు - లోపలి - మెలికలు తిరిగి ఉండే మెట్లదారిగుండా పైకి ఎక్కవలసి ఉంటుంది. మొదటి మూడు అంతస్తులు ఇసుకరాతితో నిర్మించారు



పైనున్న రెండు అంతస్తులలో చలువ రాతిని ధారాళంగా ఉపయోగించడం జరిగింది కుతుబ్‌మీనార్ ప్రధానంగా ఒక విజయ శిఖరం. అది గెలుపుకు సంకేతంగా నిలుస్తుంది. సైనిక అవసరాలకు కావలి గోపురంగా కూడా పనికి వస్తుంది విజయ శిఖరంగా యావత్ ప్రపంచంలో దీనికి సాటి అయినది మరొకటి లేదు అడుగున ఒక పెద్ద ఘనరూపమైన పునాదిపై ఈ మీనార్ దృఢంగా నిర్మింప బడింది ప్రస్తుతం ఆధునిక సాంకేతిక నైపుణ్యంతో దీన్ని బలపరుస్తున్నారు

ఆగ్రాలోని తాజ్‌మహల్ ఇండియాలో పొడవైన చారిత్రక స్మారక చిహ్నం. ఎత్తులో కుతుబ్‌మీనార్ ద్వితీయ స్థానం అలంకరిస్తుంది. తాజ్‌మహల్ 74 21 మీటర్ల ఎత్తులో ఉండగా కుతుబ్‌మీనార్ 72 5 మీటర్ల ఎత్తులో ఉంటుంది.

13వ శతాబ్ది తొలి సంవత్సరాలలో మామ్‌లుక్ లేదా బానిస వంశస్థాపకుడైన కుతుబ్ - ఉద్ - దీన్ ఐబక్ కుతుబ్ మీనార్ మొదటి అంతస్తును నిర్మించాడు. అతని వారసుడైన అల్‌టట్‌మిష్ మరో మూడు అంతస్తులను జోడించాడు. కానీ నాలుగో అంతస్తు 1378లో నష్టపడింది కనుక ఫిరుజ్ తుగ్లక్ నాలుగో అంతస్తును పునర్నిర్మించ టమేకాక 14వ శతాబ్దిలో ఐదవ అంతస్తును కూడా కలిపాడు. ఆ తరువాత కూడా కుతుబ్ మీనార్ మరమ్మతులకు లోనైంది.

— 'పార్థ' సౌజన్యంతో

## విమానయానంలో భోజనం సమకూర్చిన మొదటి విమాన సంస్థ

ప్రపంచంలో మొట్ట మొదటిసారి విమాన ప్రయాణంలో భోజనం సమకూర్చినది యునైటెడ్ కింగ్‌డమ్‌కు చెందిన హాండ్లీ పేజ్ ట్రాన్స్‌పోర్ట్ ఈ విమాన సంస్థ *1919* అక్టోబర్ *11* న తన లండన్ - పారిస్ విమాన ప్రయాణ సమయంలో అల్పాహారపు పెట్టెలను అందించింది.

అత్యధిక వార్తాపత్రికలు, మాగజైనులు తమ ప్రచురణల్లో కార్టూన్లు ఉపయోగించటం వాటి ప్రజాదరణకు సాక్ష్యంగా నిలుస్తుంది. ఒక కార్టూన్ - తెలియపరుస్తుంది, బోధిస్తుంది, మనవి చేసుకుంటుంది, కోపోద్రేకాలు పుట్టిస్తుంది మరియు సంతోష పరుస్తుంది ప్రజాభిప్రాయాల్ని ప్రతిబింబించేందుకు తోడ్పడుతుంది.



బహుశా జేమ్స్ గిల్రే "ఆధునిక కార్టూన్ పిత"- (లేదా) బ్రిటన్‌లో "రాజకీయ వ్యంగ్య చిత్రాల ఉత్తమ మూలపురుషుడు" కావచ్చు. రాజకీయ మరియు సాంఘిక పరమైన పరిహాస చిత్రణను అతడు ప్రత్యేకంగా అభివృద్ధి చేసుకున్నాడు. అతడు మూడవ జార్జి, చార్లొట్టె మహారాణి, ప్రిన్స్ ఆఫ్ వేల్స్, నాటి గొప్ప రాజకీయ నాయకులైన పిట్, ఫ్రింగ్ మరియు షరిడిన్‌లపై బడ్డాడు. ఆధునిక దృష్టిలో అతడు ఒక వృత్తి పరమైన కార్టూనిస్టు.

కార్టూన్లకు అంకితమైన 'పంచ్' మాగజైన్‌ను 1841 లో హెన్రీ మేహర్యూ నెలకొల్పాడు. పార్లమెంట్ కొత్త భవనాలను అలంకరించేందుకు కొత్త కుడ్య వర్ణ చిత్రాలకోసం అన్వేషిస్తూ 1843 లో జరిపిన పోటీలో 'పంచ్' గెలుపొందినప్పుడు హాస్య ప్రధానంగా గీయబడిన చిత్రాలకు ఈ 'కార్టూన్' పదం అతుక్కు పోయింది. 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో ప్రజాభిప్రాయంపై 'పంచ్' కార్టూన్ అధిక ప్రాబల్యం సాధించుకున్నది. 1920 నుండి వార్తా పత్రికలలో కార్టూన్ల ప్రాముఖ్యం, ఆధిక్యం పెంపొందించటం జరిగింది.

20 వ శతాబ్దానికి చెందిన అత్యంత ప్రజాదరణ పొందిన ఖ్యాతి కెక్కిన కార్టూనిస్టులలో సర్ డేవిడ్ లో (David low) ఒకరు అతడు తన సొంత కల్పనా శక్తికి పేరొందాడు శునకాల శరీరాలపై రాజకీయ నాయకుల తలలను ఉపయోగించటం అమలు జరిపాడు

అమెరికాలో కార్టూనింగ్‌కు 19 వ శతాబ్ది తొలినాళ్ళలో జాడలు కనిపిస్తాయి తొలినాళ్ళలో తెలిసిన కార్టూన్లు బెంజమిన్ ఫ్రాంక్లిన్ యొక్క 'Suave' (రమ్యత) మరియు బ్రిటిష్ ప్రాబల్యం గల కార్టూన్లు అంతర్యుద్ధకాలం థామస్ నాస్ట్ (1840 - 1902) ను వెలుగులోకి తెచ్చింది డెమొక్రాటిక్ పార్టీకి చెందిన గాడిదను, రిపబ్లికన్ పార్టీకి చెందిన ఏనుగును, రాజకీయ కార్టూనింగ్‌కు తగినట్లు ఇతర చిహ్నాలను అతడు కొత్తగా కనిపెట్టాడు 20 వ శతాబ్ది ప్రారంభానికి

## పాదరక్షలు

*ఒక చిన్న పిల్ల ఏడుస్తోంది. ఎందుకని అడిగితే ఇలా చెప్పింది.*
*"నా కొత్త పాదరక్షలు బాధ పెడుతున్నాయి."*
*"దీనిలో ఆశ్చర్యం లేదు! నీవు వాటిని పాదాలకు తప్పుగా తొడుక్కున్నావు."*
*ఆ పిల్ల మరింతగా కన్నీళ్ళు కారుస్తూ చెప్పింది:*
*"కానీ నాకున్న పాదాలు ఇవే కదా!"*

"వార్తాపత్రికలు చెప్పే వాటిలో పూర్తిగా నమ్మదగ్గవి వ్యాపార ప్రకటనలు మాత్రమే." —జెఫర్సన్

ముందు అమెరికాలో ప్రతిదినం సంపాదకీయ కార్టూన్లు జర్నలిజంలో ఒక క్రమబద్ధమైన భాగంగా తయారయ్యాయి ఆధునిక కార్టూనిస్టులు గీతలు మరియు రూపాలలోని బావప్రకాశ గుణాలపై ఎక్కువ విశ్వాసం ప్రదర్శిస్తున్నారు

కార్టూన్ రంగంలో ఇండియా ప్రవేశం ఇటీవలనే జరిగింది. ఈ శతాబ్ది మూడవ దశాబ్దంలో కె శంకర్ పిళ్ళై అనే కార్టూనిస్ట్ రాజకీయ నాయకుల యొక్క, పరిస్థితుల యొక్క రూపాలను వినోదకరంగా చిత్రీకరించేవాడు. ప్రతిరోజు మొదటి పేజీలో కార్టూన్ ప్రచురించే మొదటి జాతీయ దినపత్రిక 'హిందూస్థాన్ టైమ్స్" లో అతడు పనిచేశాడు.

1950 లలో ఇంగ్లీషులో కార్టూన్ ప్రధానం గల ఏకైక మాగజైన్ అయిన శంకర్స్ వీక్లీ - 1975 జులైలో మూతబడే వరకు యువ కార్టూనిస్టుల అభివృద్ధికి స్ఫూర్తి కలిగించింది

"టైమ్స్ ఆఫ్ ఇండియా" లో తన పాకెట్ కార్టూన్స్ అయిన "యూ సెడ్ ఇట్" లోని 'కామన్ మాన్' ద్వారా అంతర్జాతీయ ఖ్యాతి గడించిన కార్టూనిస్ట్ ఆర్.కె. లక్ష్మణ్ పాఠకుల హృదయాలను దోచుకున్నాడు. చేదైన కుట్టినట్లు అపహాస్యము కల్గించే కార్టూన్ల నుంచీ సంపూర్ణంగా వినోదకరమైన కార్టూన్ల వరకూ అతని కలం దెబ్బలు అతని భావాల మాదిరిగానే ఆహ్లాదకరంగానూ, ఆకర్షణీయంగానూ ఉంటాయి.

మరొక కార్టూనిస్ట్ అయిన 'మారియో' - ప్రధానంగా ఒక "సామాజిక కార్టూనిస్ట్" అతని కార్టూన్లు "పొడుచుకు వచ్చిన ముక్కులు, ఉబ్బిన పొట్టలు గల అనేకమంది మనుషులతో, ఉల్లాసమైన స్త్రీలతో" రూపొందించబడి ఉంటాయి అప్పుడప్పుడు ఒక కుక్క లేక ఒక పిల్లి అతని చిత్రాల్లో కన్పిస్తుంది.

కార్టూన్లకు ఎప్పుడూ ప్రజాదరణ పొందే ముఖ్యాంశం - వినోదం మరియు చమత్కారం. పదునైన, నిశ్చితమైన ధైర్యంగల దెబ్బలతో కార్టూనిస్ట్ తన అభిప్రాయం ప్రకటిస్తూనే తన ప్రేక్షకుల్ని నవ్విస్తాడు. జీవితపు విసుగు, వికృతులకు కార్టూన్లు సుగంద ద్రవ్యాన్ని, వైవిధ్యాన్ని సమకూరుస్తాయి.

హెర్బర్ట్ బ్లాక్ మాటల్లో "ప్రజాస్వామ్యాన్ని మంచి ఆరోగ్యస్థితిలో నిలిపే శక్తివంతమైన వాటిల్లో కార్టూనిస్టు ఒకడు" ప్రతిరోజు అనేక సంఘటనలు ప్రపంచమంతటా జరుగుతుంటాయి ఈ మార్పులపైన, సంఘంలోని సభ్యులపై దాని ప్రభావం పైన వ్యాఖ్య చేసేది కార్టూనిస్టే. అతడే రాబోయే అపాయం (లేదా) అభివృద్ధి గురించి వివరించ గలుగుతాడు ఆధునిక సమాజంలో బహుముఖ ప్రజ్ఞగల కార్టూనిస్ట్ ఒక ఆవశ్యకమైన ఆకృతి. అలక్ష్యం చేయదగినవాడు కాడు.

— "ది వర్డ్" సౌజన్యంతో

## అపార్థాలు

*సేవచేసేందుకు (లేదా). నాయకత్వం వహించేందుకు వెలువలికి వచ్చిన వ్యక్తుల చేష్టలు - ప్రపంచ ప్రారంభం నుండి అపార్థానికి గురవుతూనే ఉన్నాయి.*

— *గాంధీజీ*

## మూడు విషయాలు

***ఆత్మాదరణ, ఆత్మజ్ఞానం, ఆత్మనిగ్రహం - ఈ మూడు విషయాలు మాత్రమే సర్వాధికారం గల శక్తివైపు జీవితాన్ని నడిపిస్తాయి***

— టెన్నిసన్

# 5000 కి.మీ.లు ప్రయాణించే గోల్డెన్ ప్లోవర్

ఎక్కడా ఆగకుండా 5000 కి.మీ ల దూరం - మూడు రోజులు సముద్రం పైన ఆకాశయానం చేసే గోల్డెన్ ప్లోవర్ 75 - 80 గ్రాములు మాత్రమే బరువు ఉంటుంది. ఇంతటి సాహస కృత్యం నెరవేర్చేందుకు శక్తిని కూడగట్టు కుంటుంది. ఈ విచిత్రం పట్ల శాస్త్రజ్ఞులు కూడా ఇప్పటికీ విభ్రాంతి చెందుతూనే ఉన్నారు.



అనుకూల సంవత్సరం, దీర్ఘమైన శీతోష్ణస్థితి, ఆహారం - వీటిని వెదుకులాడుతూ పక్షులు వలసపోతాయి. కానీ ఈ వలసపోవటం కూడా ఒక విచిత్ర అంశంగానే నిల్చిపోతున్నది. ఇంత కచ్చితంగా పక్షులు అంతంత దూరం ఎలా ప్రయాణిస్తాయి? దీన్ని గురించి శాస్త్రజ్ఞులు అనేక సిద్ధాంతాలు చెబుతారు - పక్షులు తమకు మార్గదర్శకంగా సూర్యుణ్ణి, నక్షత్రాలను, భూమి అయస్కాంత క్షేత్రాన్ని కూడా ఉపయోగించుకుంటాయి. బహుశా వాటి ప్రయాణాలకు మార్గదర్శకంగా కొన్ని సాధనాల కలయికలను ఉపయోగించుకుంటాయి.

వీటి వలస ఉత్తరం నుండి దక్షిణానికి జరుగుతుంది. పక్షులు నీటిపై కంటే నేలపై ఎగిరి ప్రయాణించేందుకు ప్రాధాన్యం వహిస్తాయి. ఎక్కడైనా నీటిని దాటవలసి వచ్చినా, తీరానికి అతి చేరువలో దాటేందుకు ప్రయత్నిస్తాయి

ఇండియాకు వలస వచ్చే పక్షులు సుదూర ప్రాంతాలైన సైబీరియా, తూర్పు యూరప్, మధ్య ఆసియా మరియు హిమాలయాల నుండి వస్తాయి.

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

# సినీ ప్రపంచం

## బెంగాల్ ప్రథమ అత్యుత్తమ తార

*ప్రథమ బెంగాల్ అత్యుత్తమ తార కనన్ దేవి మొదటిసారి మూకీ చిత్రం జాయ్‌దేబ్ - లో నటించింది. దీనికి జ్యోతిష్ బెనర్జీ దర్శకత్వం వహించారు. 1947 లో ఆమె అశోక్ కుమార్‌తో కలిసి ''చంద్రశేఖర్''లో నటించింది ఇది ఆమెకు ప్రజాదరణ తెచ్చిన చిత్రం దీనిలో నటించి నందుకు ఆమెకు 1 25 లక్షలు చెల్లించారు*

## నేపధ్య సంగీతం ప్రవేశపెట్టిన బోరల్

*సుప్రసిద్ధ సంగీత దర్శకుడు ఆర్ సి. బోరల్, భారతీయ చలన చిత్రాలలో నేపధ్య సంగీతం ప్రవేశపెట్టిన ఖ్యాతి పొందారు*

## ప్రథముడు

*వైడ్ స్క్రీన్ మరియు స్టీరియోఫోనిక్, సౌండ్‌కు ప్రథముడు అబెల్ గాన్స్ - మొట్టమొదటిసారిగా 1926 లో నెపోలియన్ చిత్రానికి ఒకేసారి మూడు తెరలు, ఒక కదిలే కెమెరా ప్రవేశ పెట్టాడు ఆధునిక విస్తృత తెర సినిమాటోగ్రఫీకి ఈ 3 స్క్రీన్ విధానం మార్గదర్శి.*

''తమ సొంత విషయంలో చాలామంది

ఇండియాలో మొదటి కారు క్రాంప్టన్ గ్రీవ్స్ కంపెనీకి చెందిన ఫాస్టర్. 1897 లో ఇది ఇండియాకు తీసుకురాబడింది

ఒక కారును స్వంతం చేసుకున్న మొదటి భారతీయుడు - జంషెడ్జీ టాటా. ఇది 1901 లో జరిగింది.




1911 వ సంవత్సరంలో ఇండియాలోని మొదటి టాక్సీ బొంబాయికి చేరింది

ఇండియాలో కారు నడిపిన మొదటి స్త్రీ - సుజన్నే ఆర్.డి. టాటా. ఇది 1905 ప్రాంతాలలో జరిగింది.

మొదటి మహిళా ట్రక్ డ్రైవర్ - మధ్యప్రదేశ్‌కు చెందిన పార్వతీ ఆర్య. తన (ఎంబియు - 4534) లారీలో మరో సహాయకులు లేనందువల్ల ఆమె కాబిన్‌లోనే నిద్రించేది

మొదటి మహిళా టాక్సీ డ్రైవర్ - కలకత్తాకు చెందిన జస్బీర్ కౌర్. 1981 నుంచి ఆమె తన అంబాసిడర్ టాక్సీ (డబ్ల్యు ఎం.టి - 2401) ని నడుపుతున్నది.

బొంబాయిలో అతి భారమైన ట్రాఫిక్ నిలుపుదల 1983 జూలై 13 న జరిగింది. అత్యధిక వర్షంతో కూడిన విద్యుత్ ప్రసారం నిలిపివేత కారణంగా నగరంలోని ట్రాఫిక్ ఆ సాయంకాలం 6 గంటలకు నిలుపుదలకు గురై మర్నాడు ఉదయం 4.30 గంటలకు పూర్తయింది

ఇండియాలో ఘోర ప్రమాదం 1988 మార్చి 16న రాయపూర్ (ఎం పి) సమీపంలో జరిగింది 130 మంది సభ్యులుగల ఒక వివాహ బృందం ప్రయాణం చేస్తున్న బస్సుకు నిప్పు అంటుకుని ఒక మురికినీటి కాలువలోకి దొర్లి పోగా అందరూ మృతి చెందటం జరిగింది.

అమెరికాలో 1913లో ప్రైవేటు కార్లు మిలియన్ సంఖ్యకు చేరుకోగా ఇండియాలో 1980లో మాత్రమే ప్రైవేటు కార్లు మిలియన్ సంఖ్యకు చేరుకున్నాయి వచ్చే శతాబ్దంలోగా ఇది 10 మిలియన్ సంఖ్య చేరే అవకాశం లేదు

ఇండియాలో అతి పొడవైన జాతీయ రహదారి - హైవే నెం 7 2,325 కి.మీ ల పొడవు గల ఈ రహదారి వారణాశినీ, కన్యాకుమారినీ కలుపుతుంది

డ్రైవింగ్ లైసెన్స్ సంపాదించుకునేందుకు ఇండియాలో అత్యంత మొండిపట్టుదలతో ప్రయత్నించిన వ్యక్తి బహుశా గీత్ కౌర్ రన్‌ధావా కావచ్చు ఆమె తన 48వ ప్రయత్నంలో 330 పాఠాలు నేర్చుకుని - 1987 జూన్ 19 న - విజయం సాధించింది. ఆమెకు అప్పుడు 50 సంవత్సరాలు పైబడిన వయస్సు ఉంటుంది

— 'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో

"ఎవరైతే జ్ఞానం సముపార్జించుకుని ఏనాడూ తన జ్ఞానాన్ని ఉపయోగించం చేస్తారో, అతడు పండితుడు పుస్తకాల బరువు మోసే మృగం వంటివాడు."

— సాది

## హృదయ కవాటాల వాణిజ్య ఉత్పత్తి

హృదయ కవాటాల వాణిజ్య మహారాష్ట్రలోని థానెలోని ఒక పరిశోధనశాలలో ప్రారంభమైంది. వర్ధమాన దేశాలలో మొదటిది అయిన ఈ యూనిట్ యాంత్రికపరమైన, జీవశాస్త్ర పరమైన హృదయ కవాటాలకు రూపురేఖలు కల్గించింది గట్టిపడకుండా చేయగల వాటి (Anti - coagulants) యొక్క అవసరం లేకుండా చేస్తుంది. ఈ యాంత్రిక కవాటంలో ఉపయోగించిన వస్తువు-జిర్కోనియం.

## రికార్డ్ధరలో పికాసో చిత్రాల వేలం


PABLO PICASSO

ఒక మాతృమూర్తి తన కుమారుని సంబిస్తున్నట్లు పాబ్లో పికాసో వేసిన నీలివర్ణ చిత్రం - "మెటర్నిటీ" - లండన్‌లో జరిగిన ఒక వేలంలో 24.75 మిలియన్ డాలర్లకు విక్రయించబడింది. ఒక కళాఖండానికి ఇంత వరకు చెల్లించబడిన అధిక మూల్యాలలో ఇది మూడవది. 20వ శతాబ్ది పెయింటింగ్‌కు ఇది ఒక రికార్డు.

## బొద్దింకలను అదుపు చేసే శిలీంధ్రం

యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన ఎకో సైన్స్ కార్పొరేషన్ చిన్న పెట్టెలను తయారు చేసింది వీటిపైకి బొద్దింకలు ఎగబ్రాకగానే సహజంగా సంభవించే శిలీంధ్రపు (fungus) డోస్ బొద్దింకల మందమైన వెలుపలి ఒఖలోకి సులభంగా దూరి ఒక ప్రాణాంతకమైన అంతర్గత అంటువ్యాధిని ప్రారంభిస్తుంది. ఈ అంటువ్యాధి స్పర్శ ద్వారా వ్యాపించేది కనుక ఒక బొద్దింక నుంచి మరోదానికి వ్యాప్తి చెందుతుంది

## ఫ్రాన్స్‌కు చెందిన పొడవైన ఉత్తరీయం

170 మీటర్ల పొడవు గల ఫ్రాన్స్‌కు చెందిన ఉత్తరీయాన్ని 12 రోజుల వ్యవధిలో ఫ్రాన్స్‌లోని కార్కసొన్నెకి చెందిన 250 మంది గల ఒక బృందం తయారు చేసింది. 1985 లో లైయన్స్ (సెంట్రల్ ఫ్రాన్స్)లో తయారైన 102 మీటర్ల పొడవు గల ఉత్తరీయపు రికార్డును అధిగమించేందుకు వీరు 11 గంటల షిఫ్టులలో పనిచేశారు

# 1979 నాటి వార్తలు

## ప్రపంచంలో ప్రథమ పాకెట్ టెలివిజన్

*జపాన్ తయారు చేసిన ప్రపంచంలోని ప్రప్రథమ పాకెట్ టెలివిజన్‌ను రెండు లిథియం బ్యాటరీల సహాయంతో 3 గంటల పాటు నిర్విరామంగా చూడవచ్చు. ఇది 11.8 సెం.మీ.ల పొడవు, 11.5 సెం.మీ.ల వెడల్పు కలిగి 640 గ్రాముల బరువుతో ఉంటుంది. దీనికి 3 6 × 4 8 సెం.మీ.ల సమమైన తెర ఉంటుంది. ఒక కోణం నుంచి చూసినా కూడా సుస్పష్టమైన చిత్రాన్నే ఈ పాకెట్ టెలివిజన్ ద్వారా ఎవరైనా చూడ గలుగుతారు.*

"ఒక లేత చెట్టు వంగుతుంది, ఒక ముసలి చెట్టు విరుగుతుంది."

## ప్రపంచంలో పొడుగైన విగ్రహం

రష్యాలోని ఓల్గోగ్రాడ్‌కు వెలుపల మమయేవ్ కొండ పైననున్న భారీ ప్రీస్ట్రెస్‌డ్ కాంక్రీట్ మహిళా విగ్రహం "ది మదర్‌లాండ్" ప్రస్తుతం ప్రపంచంలోనే ఎత్తైన విగ్రహం స్టాలిన్ గ్రాడ్ యుద్ధం (1942 - 43) లో రష్యా విజయాన్ని ఒక శాశ్వత స్మృతిగా నిల్పేందుకు -1967లో యవ్‌గెని ఉచిటిచ్ - దీన్ని రూపొందించాడు విగ్రహం పునాది నుండి - ఆమె కుడి పిడికిలితో బిగించబడిన పట్టా కత్తి వరకు - 82 30 మీటర్లు (270 అడుగులు) పొడుగు ఉంటుంది

## 1.8 మిలియన్ ఏళ్ళనాటి మానవుని దవడ ఎముక

కాకసస్‌లో త్రవ్వకాలు జరిపినప్పుడు 1 8 మిలియన్ ఏళ్ళనాటి మానవుని దవడ ఎముకను జర్మన్ శాస్త్రజ్ఞులు కనుగొన్నారు అంతకు క్రితం భావించినట్లుగా కాక ఇంకాముందుగానే మానవుడు యూరప్ చేరుకున్నాడని ఇది ఋజువు చేస్తున్నది. ఈ దవడ 20 నుంచి 21 సంవత్సరాల వయస్సు గల ఒక Homoerectus స్త్రీకి చెందింది ఆమె క్రింది 16 పళ్ళు ఇప్పటికీ చెడకుండా ఉన్నాయి.

## 90 నిమిషాల్లో జరిగిన అరుదైన శస్త్రచికిత్స

జలంధర్. (పంజాబ్) లోని ఇ.ఎస్.ఐ హాస్పిటల్‌కు చెందిన శస్త్రవైద్యుడు డాక్టర్ సంజీవ్ బాబుటా 90 నిమిషాల్లో ఒక అరుదైన శస్త్రచికిత్స చేసి గణేష్ మాథుర్ అనే కార్మికుని ఉదరం నుంచి 16 అడుగుల పొడవు, 1 5 సెంటీ మీటర్ల మందం కలిగి వంపు తిరిగి ఉన్న ఒక ఇనుపకడ్డీని వెలికి తీశాడు. మాథుర్ ఒక ఇనుప కడ్డీల కుప్పమీద పడిపోగానే స్పృహకోల్పోగా ఆస్పత్రికి తెచ్చార డాక్టర్ బాబుటా ఈ ఇనుప కడ్డీని (abdomi perineal) నేర్పుతో మలద్వారం వద్దకు చే పరికరాల ద్వారా తొలగించాడు.

## కూరగాయల్ని నిలవ చేసేందుకు సౌరశక్తి

కూరగాయల్ని, మిరపకాయల్ని ఎండబె నిలవచేసేందుకు, బావుల నుంచి నీటి తోడేందుకు, వీధి దీపాలు వెలిగించేందు రాజస్థాన్ రాష్ట్రంలోని జోధ్‌పూర్‌లో ఉన్న సెంట్రల్ ఏరిడ్ జోన్ రిసెర్చి ఇన్‌స్టిట్యూ సౌరశక్తిని ఉపయోగిస్తున్నది

## ఆనాటి వార్తలు

### పక్షుల ఆస్పత్రి

*ప్రపంచంలో ఏకైక పక్షుల ఆస్పత్రి పాత ఢిల్లీల చాందినీ చౌక్‌లో గల దిగంబర్‌లాల్ జైన్ మందిరం ఉన్నది ఈ ఆస్పత్రి 1926లో స్థాపించబడిం*

### 15 $^1/_2$ గంటలు మాట్లాడిన సెనెటర్

*లూసియానా (యునైటెడ్ స్టేట్స్) కు చెంది సెనెటర్ హ్యూయి లాంగ్ 1935 జూన్ 12 వ తే రాత్రి 12 30 గంటలకు సెనెట్‌లో తన ప్రసం ప్రారంభించి మరునాడు తెల్లవారు ఝామున గంటలకు శారీరక అలసట వల్ల తన కుర్చీ కూలబడ్డాడు అతడు ఎడతెగకుండా 15 గంటలు ప్రసంగించాడు 'కాంగ్రెషనల్ రికార్డు' అతని ఉపన్యాసంతో 100 పేజీలు నిండిపోయాయి ఈ సుదీర్ఘ ఉపన్యాసం ముద్రించేందుకు ప్రభుత్వ 5,000 డాలర్లు వ్యయం చేసింది*

"కోపం మరో వ్యక్తికి హాని కల్గించేందుకు ముందే నీకు హాని కలుగజేస్తుంది."

## హెచ్.డబ్ల్యు. ఆర్మ్‌స్ట్రాంగ్

విజయానికి సూత్రాలు ఎవరూ విక్రయించ రు. జీవితంలో విజయ శిఖరాగ్రం చేరుకున్న ్యక్తుల జీవితాలనుంచి నేర్చుకున్న పాఠాల ంచి కొన్ని సూచనలను మనం తీసుకోవాలని వేకం ప్రబోధిస్తున్నది అసంఖ్యాకమైన జయవంతమైన. జీవితాలను గురించి ్రంగానూ మరియు చిత్తశుద్ధితోనూ అధ్యయనం సి, శాస్త్రీయ దృష్టితో పరిశీలించినప్పుడు,



్ని ప్రాథమిక అంశాలు వెలుగులోకి వచ్చాయి. ిని "విజయానికి శాసనాలు" అని విశ్వస ంగా అంగీకరించవచ్చు. ప్రస్తుతం ఏడు ప్రధాన ుయ శాసనాలను గురించి తెలుసుకుందాం.

సరైన గమ్యస్థానం నిర్ణయించుకోవాలి : సరైన ్యస్థానం అభ్యుదయేచ్ఛను ఉదయింపచేస్తుంది.- ్యధికులైన విజేతలకు సరైన గమ్యస్థానాలు ్నాయి. చాలామంది ఏ గమ్యం గురించి ోచించరు, ఎక్కడికీ చేరుకోలేరు. జీవితంలో క లక్ష్యం, ప్రయోజనం లేకపోయినట్లయితే పరిస్థితులకు బలి పశువుగా మారిపోతావు. స్థితులకు ఆధిపత్యం వహించి, అదుపులో ంచేందుకు ప్రయత్నించు. ఒక నిర్దిష్ట గమ్యస్థానం కలిగి ఉండు. ఆ గమ్యానికి నిన్ను చేర్చేటట్లు పథక రచన చేసుకో జీవితానికి ఒక ప్రయోజనం ఉన్నట్లయితే అది క్రియాశీల ఆశను ఉత్తేజ పరచేదిగా ఉండాలి

విద్య లేక సన్నాహం : ప్రయోజనాన్ని సాధించేందుకు అవసరమైన పరిజ్ఞానాన్ని సంపాదించుకో. మూగజంతువుల మాదిరి మానవాళి సహజ బుద్ధి పుట్టలేదు. ఈ సహజబుద్ధి వాటికి గల అనుకూల్య స్థితి. మానవ ప్రాణులు అధ్యయనం చేసేందుకు, విద్యాభ్యాస శిక్షణ పొంది తాము చేయదలచిన పని నెరవేర్చేందుకు సంసిద్ధులు కావాలి. విజయం వరించిన పురుషులందరూ తమ ప్రత్యేక వృత్తిలో స్వయంగా విద్యాభ్యాసం పొందినవారే. విద్యాభ్యాస మంటే కేవలం పుస్తకాల ద్వారా నేర్చుకునేదే కాదనీ, వ్యక్తిత్వ అభివృద్ధి, నాయకత్వం, అనుభవం, పరిచయాలు, అనుబంధాల ద్వారా జ్ఞాన సముపార్జన మరియు పరిశీలన కూడా కలిసి ఉండాలని వారు గుర్తించారు.

మంచి ఆరోగ్యం మనం శారీరక జీవులం. మనం భుజించేదే మనిషి రూపం ధరిస్తుంది. లోపమైన ఆహారం వల్లనే 95 శాతం అస్వస్థతలు, వ్యాధులు వస్తాయి. శిశువులు పెరిగితే పెద్ద వారవుతారు అనేక మంది విచక్షణారహితంగా భుజిస్తారు

నీవు తినదగినదేమిటో, తినదగనిదేమిటో గ్రహించుకోవాలి. ఆరోగ్య శాసనాలలోని ఇతర శాసనాలు ఇవి: కంటి నిండా నిద్ర, వ్యాయామం, పుష్కలమైన తాజాగాలి, పరిశుభ్రత మరియు సక్రమమైన తొలగింపు, సరైన ఆలోచన,

"తమ మరణానికి ముందే పిరికివారు అనేకసార్లు చనిపోతారు."
— షేక్స్పియర్

పరిశుద్ధ జీవితం. అస్వస్థత మరియు వ్యాధి - శరీరం మరియు మనస్సు ప్రకృతి ధర్మాలను పాటించనప్పుడే వస్తాయి. ఇవి ఆరోగ్యానికి చెందిన శారీరక చట్టాలు.

శారీరక స్థితిపైన మానసిక స్థితి చెప్పుకోదగిన ప్రాబల్యం కలిగి ఉంటుంది. ఆత్మవిశ్వాసం అనే మానసిక వైఖరివల్లనే అనేక మంది విజయం సాధించిన పురుషులు నిర్మాణాత్మకంగా ఆలోచిస్తారు.

చొరవ : విజయం-ఒక సిద్ధించిన పని. అది నెరవేర్చినది. చురుకుదనం లేని వ్యక్తి పనిపూర్తి చేయలేడు. సిద్ధించిన పని నెరవేర్చినట్లే. ఒక విజయవంతమైన వ్యక్తి తను చొరవగా ఉండటమే కాక తన క్రింద పని చేసేవారిలో కూడా చొరవను కలిగిస్తాడు. లేని పక్షంలో వీరు ఆలస్యం చేసి, విడిచిపెట్టి, అలాగే స్తబ్దంగా నిల్చిపోతారు. శక్తి, చొరవ, నిరంతర ప్రేరణ లేకుండా ఒక వ్యక్తి నిజంగా విజయం సాధించలేడు.

సమయోచిత బుద్ధి : జీవితం తరచుగా ఆపదలను, అడ్డంకులను అనుకోని సమస్యలను ఎదుర్కొంటుంది. ఏదో ఒక ఆకస్మిక చిక్కు తలెత్తి నిన్ను పూర్తిగా నిలిపి వేస్తుంది ఈ పరిస్థితుల్ని ఎదుర్కొనేందుకు మనకు సమయోచిత బుద్ధి అవసరమౌతుంది. ఆకస్మిక అత్యావశ్యక పరిస్థితులు తలెత్తినప్పుడు నీకు - స్వచ్ఛమైన మేథ, ప్రశాంతమైన నరాల బలం, త్వరితగతిలో ఆలోచన, లోతైన వివేకం - అవశ్యకాలు. అన్ని యదార్థ విషయాలను గ్రహించుకుని తెలివిగల నిర్ణయానికి వచ్చేందుకు వీలుగా నీకు ప్రశాంతమైన మెదడు కావాలి. ఆందోళన స్థితిలో కార్య-నిర్వహణకు దుమికేందుకు సిద్ధమైనా నీవు ఉద్రేక పడకుండా ఉండటం అలవర్చుకోవాలి. సరైన నిర్ణయం తీసుకుని, దాన్ని అమలు చేయగలగాలి.

పట్టుదల : మరికొంత విడవకుండా ఉ టంతో, దానిపై మరికాస్త విశ్వాసం క ఉండటంతో, మరియు పట్టుదల కలిగి ఉండట స్పష్టమైన అపజయం కూడా ఉజ్జ్వల విజయంగా మారిపోయే సమయంలో జన వదిలి వేస్తారు

ఈ ఆరు శాసనాలను అనుసరించిన వ విజయం సాధించారు, వారి గమ్యాన్ని క కున్నారు, డబ్బు గడించారు, హోదా పొంద వారు భౌతిక సుఖాలను అనుభవించ అయినా వారి జీవితాలు శూన్యమైనవ వారు ఎన్నటికీ సంతృప్తి చెందలేరు. వ శాశ్వతమైన, నిరంతర సౌఖ్యం లభించదు మరణించినపుడు తమ ఆర్జితాలను వె తీసుకు వెళ్ళలేరు వారితోబాటు వారి కూడా అస్తమిస్తుంది. వారికి లేనిదల్లా - విజ శాసనం అనుసరించటంలో కొఱత జరగటమే

ఏడవ విజయ శాసనం - అతి ప్రాధాన్య మొదటిది. ఇది చివరిదిగా సూచించబడట కారణం - ఇది పాఠకుని మనస్సు పై గాఢముద్ర వేసేందుకే. ఇది అన్ని వి ప్రధానమైనది. విజయానికి సప్తమ శాస - ఏది ఏమైనప్పటికీ - భగవంతు సంబంధం కలిగి, మార్గదర్శకత్వం పొందటవే

—"ప్లెయిన్ ట్రూత్" సౌజన్య

## భారతీయుల్లో గడియారా వాడకం

*ప్రతి వెయ్యిమంది భారతీయులలో కేవ 19 మంది మాత్రమే గడియారాలు ధరిస్తా ప్రపంచ సగటు వాడకం ప్రతి 1000 మం 150 గా ఉంది.*

— *"ఎకనమిక్ టైమ్స్" సౌజన్య*

"అన్ని గొప్ప సాధనలు కఠినమైనవే యోగ్యమైనదేదీ సులభంగా రాదు సాధించటం కష్టమనుకుని మీ ఆదర్శాన్ని దిగజార్చవద్దు"

## వీనస్ స్వర్గం కాదు



Phases of Venus Photographed by spacecraft

వీనస్ (శుక్రుడు) - 'ప్రేమ గ్రహం' స్వర్గం దు. అక్కడ ఉష్ణోగ్రత 480 డిగ్రీల సెంటీ డ్ ఉంటుంది. ఇది నీరు కాగే బిందువుకు 'దాపు ఐదురెట్లు.

## టెలిస్కోప్‌ను మొదట ఉపయోగించినదెవరు?

టెలిస్కోప్ నెదర్లాండ్స్ (పశ్చిమ యూరప్)లో ఁగొనబడినప్పటికీ దీన్ని మొదటగా ఉపయో ంచిన వ్యక్తి ఇటాలియన్ ఖగోళశాస్త్ర త్త గెలీలియో. ఆకాశాన్ని అధ్యయనం సేందుకు అతడు దీన్ని ఉపయోగించు న్నాడు. చంద్రుని ఉపరితలం చాలా గరుకుగా, ట్టపల్లాలతో ఉంటుందనీ, పరిభ్రమిస్తున్న నేక ఉపగ్రహాలతో బృహస్పతి గ్రహం ంటుందనీ, శనికి రెండు చిన్న సహచర ఉప హాలు ఉన్నాయనీ, చంద్రుని కళల (దశల) ె శుక్రగ్రహం ఆకారం మారుతుంటుందనీ అతడు వెల్లడించి ప్రపంచాన్ని దిగ్భ్రాంతిలో ముంచెత్తాడు. సూర్యునిపై మచ్చలు, ఇతర గుర్తులు గుర్తించిన ప్రథములలో అతడు కూడా ఒకడు.

## కాలితో త్రొక్కే బైసికిల్ కనిపెట్టిన దెవరు?

1839 లో కాలితో త్రొక్కే బైసికిల్‌ను కను

## అపూర్వ విషయాలు

## ఎరను మ్రింగే సమయంలో పట్టుబడే పక్షి

*తన ఎరను ధ్వని చేస్తూ త్వరితంగా మ్రింగుతున్న సమయంలో మాత్రమే కాపర్‌కైలీ పక్షి పట్టుబడుతుంది.*

## లోపల ఈదే పక్షి

*నీటి పక్షులు తమ మనుగడ కోసం - అది ఉప్పునీరు కానీ మంచినీరు కానీ - నీటిపై ఆధార పడతాయి. టీస్పర్ అనే నీటి పక్షి తన ఎర కోసం నీటి అడుగు భాగానికి పోతుంది తేలికైన పక్షి కనుక ఇది తన రెక్కలతో అతి త్వరితంగా నీటిలో ఈది తటాలున నీటి నుంచి వెలికి దూకి - ఆగకుండా గాలిలోకి ఎగురుతుంది*

## ప్రపంచ పర్యాటనలో 80 శాతం

*ప్రపంచ పర్యాటన ఉద్యమంలో 80 శాతం ఉత్తర అమెరికా, యూరప్, జపాన్, ఆస్ట్రేలియా మరియు న్యూజిలాండ్‌లకు పరిమితమైనది.*

*— "బిజినెస్ ఇండియా" సౌజన్యంతో*

"కానుక ఇస్తూ చిరునవ్వు చిందించని వ్యక్తి - ఆ కానుకలో సగభాగం వెనక్కి తీసుకున్నట్లే."

గొన్న వ్యక్తి - స్కాట్లండ్ (బ్రిటన్)కు చెందిన ర్క్‌పాట్రిక్ మాక్మిలన్ వెనుక చక్రం యొక్క మధ్య భాగానికి చేర్చి అమర్చబడిన పెడల్స్ ద్వారా ఇది ముందుకు త్రోయబడుతుంది 873లో 'పెన్నీ ఫార్డింగ్' లేదా పెద్ద చక్రాల సైకిల్ ఇంగ్లండ్‌లో నిర్మించబడింది. దీనికి ఒక పెద్ద చక్రం, ఒక చిన్న చక్రం ఉంటాయి. దాదాపు ఇదే సైజు గల చక్రాలున్న భద్రతా బైసికిల్ - అరుదుగా నడపబడుతూ, ఒక గొలుసును ఉపయోగిస్తూ ఉండే బైసికిల్ 885లో ఇంగ్లండ్‌కు చెందిన జె.కె. స్టార్లే తయారు చేశాడు. 1888లో వాయు సంబంధమైన టైర్లు కలిగిన బైసికిళ్ళు వాడకంలోకి వచ్చాయి 890లో "టాండెమ్స్" లేదా ఇద్దరి కోసం తయారు చేసిన బైసికిళ్ళు నిర్మించబడి కాల "మేణా ప్రజాదరణ పొందాయి

## చేపల్ని పట్టే కర్మొరంట్ పక్షి

కర్మొరంట్ పక్షి - కనికరం లేని బెస్తవాని వంటిది. చైనా, జపాన్‌లకు చెందిన స్థానిక బెస్తవారు తమ యజమానుల కోసం చేపలు పట్టేందుకు వీటికి శిక్షణ ఇస్తారు. ఇవి చేపల్ని వేటాడుతున్నప్పుడు వీటి మెడకు వారు ఒక వలయం చుట్టటం వల్ల, ఇవి పట్టుకున్న చేపల్లో అతి చిన్న చేపల్ని మాత్రమే తినేందుకు వీలవుతుంది. ఒక వలయానికి బంధించబడిన తీగె ద్వారా ప్రతి కర్మొరంట్ పక్షి స్వాధీనంలో ఉంచుకోబడుతుంది. ఒక నేర్పరియైన జాలరి 12 పక్షుల వరకు నిర్వహించుకోవచ్చు. ఈ పక్షిని పడవలోకి ఎత్తివేయగానే దాని గొంతు నులుముతారు. మ్రింగేందుకు వీలులేనంత పెద్ద చేపలను వాంతి చేసుకునేటట్లు వీటిని బలవంతం చేస్తారు.

## చిత్రాలు

*తాత్పర్య రచన: యామిజాల పద్మనాభస్వామి*

*ఇమ్ముగ చదువని నోరును*
*అమ్మా! అని పిలిచి అన్నమడుగని నోరున్*
*తమ్ముల బిలువని నోరును*
*కుమ్మరి మనుద్రవ్వునట్టి గుంటర; సుమతీ!*

*[గురువు చెప్పినది శ్రద్ధగా, బుద్ధిగా విని తప్పులు పలుకక చదవాలి. అలా చదవని నోరు, కావలసినది అమ్మని పిలిచి అడిగి పెట్టించుకోవాలి. అలా పిలువని నోరు, తమ్ములను ఆదరంగా పిలుస్తూ చేరదీసుకోవాలి. అలా పిలువని నోరు - కుమ్మరి తవ్వే మట్టి గోతులతో సమానం - అమ్మ అయినా పిలిస్తే కాని పెట్టదు - అని తెలుగులో సామెత కూడా ఉంది. కాగా! అమ్మా! అని నోరారా పిలవడం అదొక అదృష్టం]*

* *

*ఒక ఊరికి ఒక కరణము*
*ఒక తీర్పరియైనగాక ఒగి తఱుచైనన్*
*కకవికలు కాకయుండునె?*
*సకలంబును కొట్టువడక; సహజము సుమతీ!*

*[బుద్ధిమంతుడా! ఒక ఊరిలో మంచి చెడ్డలు బాగా తెలుసుకుని తీర్పు చెప్పడానికి ఒకే ఒక్క పెద్ద మనిషి ఉండాలి ఇద్దరు ముగ్గురున్నారంటే అసలు విషయం తెలియక అంతా చెడిపోయే దురవస్థ కలుగుతుంది. ఒక్కొక్కరి ఆలోచన ఒక్కొక్కలాగా ఉంటుంది. కనుక ఒకరు చెప్పే దానికీ, ఇంకొకరు చెప్పేదానికీ సరిపడక తగవు మరింత ఎక్కువవుతుంది. కనుక న్యాయం, ధర్మం, మంచి, చెడ్డ బాగా తెలిసి తగవులూ, తంటాలూ తీర్చే న్యాయమూర్తి ఊరికి ఒక్కడే ఉండాలి.]*

"మీ సొంత తెలివితేటలను ఉపయోగించండి - ఎవరూ తమ తెలివిని మీకు అరువు ఇవ్వరు కనుక."

వివిధ రకాల పనులను అమలు చేసే ...బాక్ విధానం మరియు కంప్యూటర్ మెదడు గల ఒక యంత్రంగా రోబోట్‌ను నిర్వచించవచ్చు. అన్నీ కాక పోయినా కొన్ని సులభంగా కదిలిపోతుంటాయి.



* రోబోట్స్ రూపురేఖలు, నిర్మాణం, నిర్వహణల శాస్త్ర సాంకేతిక విజ్ఞానమే - రోబోటిక్స్.

* ఆర్.యు.ఆర్. అనే తన నాటకంలో చెకొస్లొవేకియా నాటక రచయిత కరెల్ కపెక్ మొదటిసారి 'రోబోట్' అనే మాట ఉపయోగించాడు జెక్ భాషలో ''రోబోటా'' అంటే పనివాడని అర్థం

జపాన్ "రోబోట్స్ దీవి" అని పేరొందింది. ప్రపంచంలో మరెక్కడా లేనంత అధికంగా రోబోట్స్ అక్కడ ఉపయోగించబడుతున్నాయి.

పెద్ద భవనాల సైజుల్లో, ఆకారాల్లో ప్రస్తుతం తయారు చేయబడుతున్నాయి ఉదాహరణకు టోక్యో (జపాన్) లో ఒక ఫ్యాక్టరీ సైజు రోబోట్ ఉన్నది. దీని లోపలి భాగంలో చిన్న రోబోట్స్ ఇతర రోబోట్స్‌ను ఉత్పత్తి చేస్తుంటాయి ఈ రోబోట్ కార్మికుల్ని పర్యవేక్షించేందుకు దాదాపు వందమంది మానవులు సంసిద్ధంగా ఉంటారు.

* ఇంకా అనేక రకాల రోబోట్స్ ఉన్నాయి

ఆటోమేషన్: యంత్రం వలే ఉండే రోబోట్ తనంతటతానే పని చేస్తుంది

ఆన్‌డ్రాయిడ్: ఒక మానవుని వలే కనిపించి అతని వలే పనిచేసే విధంగా నిర్మించబడిన

సైబర్గ్: సగం మనిషి, సగం రోబోట్ టీవీ యొక్క "ది సిక్స్ మిలియన్ డాలర్‌మాన్ సైబర్గ్‌కు ఉదాహరణ.

డ్రాయిడ్: తమ మానవ యజమానులకు పూర్తిగా అంకితమైన రోబోట్స్. ఉదాహరణకు స్టార్‌వార్స్ చిత్రాల నుండి ఆర్2 డి2 మరియు సి - 3 పి.ఓ.

డ్రోన్: ఒక కార్మిక రోబోట్

ప్రోబోట్: ఇంటి పనులకు పనికి వచ్చే ఒక వ్యక్తిగత రోబోట్. ఫర్‌బిడెన్ ప్లానెట్ చిత్రంలో 'రబ్బీ' అనే రోబోట్.

రోబోట్రిక్స్: ఒక మహిళా రోబోట్.

సోబట్ సంతోష పర్చి ఉపచారం చేసే రోబోట్

— ''ఇన్‌స్పిరేషనల్ కోట్'' సౌజన్యంతో

## టెస్ట్ క్రికెట్‌లో రికార్డు

*టెస్ట్ క్రికెట్‌లో ఒక రోజులో ఒకే వైపున ఎక్కువ పరుగులు స్కోర్‌చేసి రికార్డు స్థాపించిన ఘనత దక్షిణాఫ్రికాకు ప్రతిగా 503 పరుగులు తీసిన ఇంగ్లండ్‌కు దక్కింది. 1924లో ఈ టెస్ట్ లార్డ్స్ (ఇంగ్లండ్) లో జరిగింది.*

## ఆంధ్ర ఆర్థిక శాస్త్రవేత్తకు అంతర్జాతీయ పురస్కారం

ఆంధ్రప్రదేశ్‌లోని తెనాలి వాస్తవ్యుడు కెనడాలోని ఓన్‌టారియోలోని యూనివర్శిటీ ఆఫ్ విండ్సర్‌కు చెందిన డాక్టర్ టి. వెంకతేశ్వర్లుకు ప్రతిష్ఠాత్మకమైన "1993 ఇంటర్నేషనల్ అవార్డ్ ఇన్ ఎకనమిక్స్" లభించింది. విద్వత్‌కు సంబంధించిన సామర్థ్యాన్ని పెంపొందించటంలో ఆయన చేసిన కృషికి ప్రతిఫలంగా బోస్టన్ (యుఎస్‌ఏ) లో జరిగిన అమెరికన్ ఎకనమిక్ అసోసియేషన్ వార్షిక సమావేశంలో ఈ అవార్డు బహూకరించబడింది.

## పండిట్ రవిశంకర్‌కు మాగ్‌సెసె అవార్డు

"మేథను ఉత్సాహపర్చే సంగీతంతో సితార్ పైన తనకుగల ఉన్నతమైన ఆధిపత్యం ద్వారా ఇండియానూ, మరియు ప్రపంచాన్నీ సంపన్నం చేసినందుకు" ప్రసిద్ధ సితార్ వాద్య కళాకారుడు పండిట్ రవిశంకర్‌కు ప్రతిష్ఠాకరమైన రామన్ మాగ్‌సెసె అవార్డు ప్రసాదించారు.

## మాగ్‌సెసె అవార్డు పొందిన భారతీయ వైద్యురాలు

గ్రామీణ ప్రజానీకానికి - ప్రజారోగ్యం, ప్రాథమిక చికిత్స మరియు జీవితావసర ప్రణాళికలపై శిక్షణ ఇచ్చిన భారత మహిళా వైద్యురాలు బానూ కొయాజీకి, ప్రజాసేవకు ఇచ్చే రామన్ మాగ్‌సెసె అవార్డు బహూకరించారు.

## ప్రఖ్యాత ఖగోళ శాస్త్రజ్ఞునకు బిర్లా బహూకృతి

ప్రఖ్యాత ఖగోళ శాస్త్రజ్ఞుడు జె వి. నర్లీకర్‌కు - కాస్మాలజీ, దానికి సంబంధించిన అంశాలపై జరిపిన కృషికి - గాను - ప్రథమ ఎం.పి. బిర్లా స్మారక బహూకృతి ప్రకటించారు

## ప్రేమ ఇంటికి ఆనందం




*ఇంటికి అందం - సామరస్యం*
*ఇంటికి భద్రత - విశ్వాసం*
*ఇంటికి ఆనందం - ప్రేమ*
*ఇంటికి సమృద్ధి - బిడ్డలు*
*ఇంటికి నియమం - సేవ*
*ఇంటికి సౌకర్యం - తృప్తిపడే ఉత్సాహాలు*
*ఇంటి నిర్మాత, నిజమైన మానవ గృహ నిర్మాత - దేవుడు -*
*స్వయంగా నక్షత్రాలను తయారు చేసి, ప్రపంచాన్ని నిర్మించినవాడు.*

*— ఫ్రాంక్ క్రెని*

"విజేత ఎప్పుడూ విడిచిపెట్టడు, విడిచి పెట్టేవాడు ఎన్నడూ జయించడు."



ప్రసిద్ధి వహించిన సుఫీ సాధువు హసన్ అంతిమ శ్వాస విడుస్తున్నాడు. అక్కడ జనం పోగయ్యారు. వారిలో ఒకడు ఆయనను అడిగాడు, "మీ గురువు గారిని గుర్తించి కొంత మాకు చెప్పండి." దానికి ఆ సాధువు ఇలా జవాబిచ్చాడు: "నాకు ఒకే గురువు ఉన్నట్లయితే అతణ్ణి గురించి చెప్పి ఉండేవాణ్ణి. అయితే అనేక మంది గురువులు కల మహద్భాగ్యం నాకు లభించింది" అని అతడు ఒక బాలుని గురించి కథ చెప్పసాగాడు:

ఒకసారి హసన్ ఒక చిన్న గ్రామం చేరుకోగా అక్కడ చిన్న బాలుడొకడు గుమ్మటంపైన కొవ్వొత్తి దీపాన్ని వెలిగించటం చూశాడు. హసన్ ఇలా ప్రశ్నించాడు: "బిడ్డా! ఈ కొవ్వొత్తిని నీవే వెలిగించావా?" కళ్ళల్లో వెలుగులతో 'అవునని' ఆ బాలుడు జవాబిచ్చాడు. ఆ బాలుణ్ణి తికమక పర్చే ఉద్దేశంతో హసన్ ఇలా అడిగాడు; "నీవు కొవ్వొత్తిని వెలిగించి కాంతి కొవ్వొత్తిలోకి ప్రవేశించటం చూశావు. ఈ కాంతి ఎక్కడి నుంచి వచ్చిందో నీవు చెప్పగలవా?" ఆ బాలుడు చురుకైనవాడు. అతని జవాబు హసన్‌ను మాట్లాడనీయకుండా చేసింది. ఆ బాలుడు కొవ్వొత్తిని ఊదివేసి అడిగాడు: "దీని వెలుతురు ఎక్కడికిపోయిందో మీరు చెప్పగలరా?" హసన్ వంగి ఆ బాలుని పాదాలను ప్రశంసా పూర్వకంగా స్పృశించాడు

## నిజాలు-నిదర్శనాలు

### సురక్షిత మంచినీటి సదుపాయం లేని 1.2 బిలియన్ ప్రజలు

*వర్ధమాన దేశాలలో సురక్షిత మంచినీటి సదుపాయం గ్రామీణ ప్రాంతాలలోని 29 శాతం మందికి మాత్రమే లభిస్తున్నది ఇండియాలో ఈ సంఖ్య 31 శాతం కాగా 1 2 బిలియన్ ప్రజలు ఈ ప్రాథమిక సౌకర్యాన్ని కోల్పోతున్నారు.*

- 'యోజన' సౌజన్యంతో

### ఇండియాలో వరి సాగుబడి

*ఇండియాలో నగటున వరిసాగు చేసే ప్రాంతం మొత్తం ధాన్యం పండించే విస్తీర్ణంలో 39 శాతంగా ఉంటుంది. ఇది ఆహార ధాన్యాల ఉత్పత్తిలో 31 శాతం ఉంటుంది.*

—'యోజన' సౌజన్యంతో

"మిమ్మల్ని మీరు అదుపు చేసుకునేందుకు మీ మెదడు ఉపయోగించండి,
ఇతరులను అదుపు చేసేందుకు మీ హృదయాన్ని ఉపయోగించండి"

రక్తం గడ్డకట్టకుండా అది రక్తాన్ని గట్టి పడకుండా చేసే ప్రొటీన్‌తో కూడిన ఉమ్మి నీటిని ఇన్‌జెక్ట్ చేస్తుంది చర్మం క్రింద నున్న ఈ ఉమ్మి 'నీరు - ప్రతి కాటు తరువాత - వాపును, బాధను కలిగిస్తుంది



ఒకే ఒక రకానికి చెందిన దోమ - అనోఫిలిస్ దోమ - మలేరియాను వెంట తీసుకు వస్తుంది తన ఉమ్మి నీటిని ఇన్‌జెక్ట్ చేసే ప్రక్రియలో ఆడ అనోఫిలిస్ దోమ రక్తప్రవాహంలో మలేరియల్ ప్రొటోజోన్‌ను విడుదల చేస్తుంది. ఆతిధేయునిలో ఈ పరాన్న మిశ్రితం యొక్క క్లిష్టమైన జీవిత భ్రమణం లివర్‌కు చేరేసరికి ఎక్కువ సంఖ్యలో వృద్ధి చెందుతుంది. లివర్‌లో చాలా రోజుల వరకు పరిశోధించదగిన లక్షణాలు ఏవీ కనిపించవు. ప్రోటోజా మళ్ళీ రక్తనాళాల్లోకి పునః ప్రవేశించి, ఈ పర్యాయం ఎర్రని రక్త కణాలకు సోకుతుంది ఇక్కడ అవి తిరిగి పునరుత్పత్తి పొంది, రక్తకణాలను పూర్తిగా నింపి, అవి బ్రద్దలయ్యేందుకు కారణమౌతాయి సాధారణంగా జీవ కణాలు ఒకేసారి బ్రద్దలై వందలాది పరాన్న మిశ్రితాన్ని రక్తప్రవాహం లోకి విడుదల చేస్తాయి. ఈ సమయంలోనే శరీర ఉష్ణోగ్రత విపరీతంగా కొన్ని గంటల పాటు పెరుగుతూ వచ్చి, త్వరితంగానే తగ్గి పోవటం జరుగుతుంది.

మలేరియా చికిత్స ఎంతో కష్టంగా తయారవ డానికి కారణం అనేకానేక ఔషధాల్ని ఎదిరించి నిల్చే పరాన్న మిశ్రితాల రకాలు వర్ధిల్లటమే ఇదే సమయంలో చీడపురుగుల మందుల్ని ఎదిరించే దోమలు కూడా అసంఖ్యాకంగా పెరిగి పోవటం జరిగింది

వయోజనులైన దోమలు గాలిలో సంపర్కం కొనసాగిస్తాయి. దీని తరువాత ఆడ దోమ 200 నించి 400 గ్రుడ్లు గల ఒక సీటిపై తేలే దోమల సమూహాన్ని నీటి ఉపరితలంపై పెడుతుంది ఇంకా నీటి గుంటలు, చెఱువులు, మురికి కాలువలు, చవిటి నేలలు మరియు బహిరంగ అపరిశుభ్ర ప్రదేశాలు దోమల సామూహిక పెంపక కేంద్రాలుగా ఉంటాయి

## మిత్రత్వం



*ఒక వ్యక్తి తన హృదయంలోని విషయాలన్నీ త్రవ్విపోసేందుకు వీలుగా ఉండేవాడే స్నేహితుడు వీటిల్లో పొట్టు ధాన్యంతో కలిసి ఉంటుంది ఆ మృదువైన హస్తాలు వీటిని స్వీకరించి పొట్టును తొలగించి, ఏది యోగ్యమో దాన్ని అట్టిపెట్టుకుని, దయాదృష్టితో మిగిలిన దాన్ని ఊదివేస్తాయి.*

**"మీరెంతో యువకుల వలె కనిపిస్తున్నారని మీ మిత్రులు పొగడ్తలు ప్రారంభిస్తే, మీరు వృద్ధులు అవుతున్నారనటానికి అదే నిశ్చితమైన గుర్తు." — మార్క్ట్వైన్**

రెండు లేక మూడు రోజుల తరువాత ప్రతి గుడ్డూ అప్పుడే జన్మించిన ఒక పురుగుగా వృద్ధి చెందుతుంది. ఈ పురుగు చురుకైన ఈత గత్తె. చుట్టూ గల నీటిలో ఉన్న వడియ గట్టిన అణువులను ఆహారంగా తీసుకుంటుంది. దీని తరువాత pupal stage ప్రారంభమౌతుంది దీని సంపాదిత జీవిత చక్రభ్రమణం యావత్తూ నీటి ఉపరితలం పైన, తన శరీరంలో నుంచి ముందరికి త్రోసుకు వచ్చిన అతి చిన్న గొట్టాల ద్వారా వాతావరణపు ప్రాణవాయువును శ్వాసించటం లోనే గడిచిపోతుంది pupal case పగిలిపోగానే రెక్కలున్న వయోజన దోమ వెలికి వస్తుంది గ్రుడ్డు మొదలు వయోజన దశ వరకు సాగే ఈ మొత్తం ప్రక్రియ కేవలం కొద్ది రోజుల్లోనే పూర్తవుతుంది. ఆడ దోమ ఒక నెలరోజులు, ఆపైన మాత్రమే జీవిస్తుంది, మగ దోమ ఒక వారం రోజులు మాత్రమే బ్రతుకుతుంది.

మురికి నీటిలో దోమలు విజయవంతంగా పెరిగి పెంపొందుతాయి. శ్వాస క్రియ కోసం. ఇవి నీటి ఉపరిభాగానికి రావటంవల్ల అప్పుడే పుట్టిన దోమలు ఆక్సిజన్ తగ్గిపోయిన నీటిలో జీవిస్తున్నవి.

వీటి సంఖ్యను అదుపు చేసేందుకు రసాయనిక క్రిమి సంహారక మందులు వాడటం జరిగింది.

అప్పుడే పుట్టిన దోమల్ని భక్షించగల గుప్పీల వంటి చేపలను రసాయనాల ద్వారా భంగపర్చబడని నీటిలో ప్రవేశపెట్టారు. Bladderwort వంటి కీటకాలపై ఆధారపడే మొక్కలు పురుగుల్ని, Pupaeని కూడా భక్షిస్తాయి, దోమల బెడదను శక్తివంతంగా అరికడతాయి.

మానవాళికి దోమలు బాధలు కలుగజేసినా, పెద్ద కీటకాలకు, పక్షులకు, చేపలకు సులభంగా లభించే ఆహారపు మూలాధారాలు అవే.

— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## ఏదో ఒకరోజు నీ పంట ఫలిస్తుంది



*జీవితం ఒక పరుగుపందెం: గమ్యం దూరంగా దారి కఠినంగా ఉన్నంత మాత్రాన కూనిరాగం తీయకండి ఏదో ఒక రోజున మీరు గమ్యాన్ని చేరుకుంటారు*

*జీవితం ఒక సముద్రయాత్ర ఓడ యొక్క స్థూల భాగాన్ని తుపానులు తీవ్రంగా తాకాయనీ తెర చాపను గాలులు చీలికలు చేశాయనీ ఫిర్యాదు చేయవద్దు ఒకరోజున నీ స్వర్గానికి నీవు చేరుకుంటావు.*

*జీవితం ఒక అభివృద్ధి: అది వికసించి, పుష్పించకముందే నల్లని నేలలో ఊపిరి తిప్పుకోలేక ప్రాణాలు కోల్పోయి మట్టిలో కలిసిపోయిందని విత్తనం వల్ల తప్పు ఎంచకండి ఏదో ఒకరోజు మీపంట ఫలితం మీకు లభిస్తుంది*

—జోసెఫ్ ఆర్. సిజు

శునకం - మనిషికి తొట్ట తొలినాటి ఉత్తమ నేస్తం కుక్కవలె యజమానిని అనుసరించట మంటే విశ్వాస పాత్రతతో యజమానిపట్ల మెలగటమని అర్థం. అయితే - భాష - శునకం పట్ల అనుచితంగా ఉన్నది కుక్క అంటే నిశ్చయంగా ఒక పనికిమాలిన (నిరర్థక) వ్యక్తి అనే అర్థం కూడా చెబుతారు పురుషుల్లో - అదృష్టం గల శునకాలు, చమత్కారి, ధూర్త శునకాలు మరియు ఉల్లాసంగల సరసమైన శునకాలు ఉన్నాయి!



ఒక తాజాశునకం (Hotdog) - పాఠశాల విద్యార్థులకు ఇష్టమైన వంటకం. కుక్క బ్రతుకు అంటే యాతనామయ జీవితమని అర్థం. కుక్కచావు అంటే నికృష్టమైన విషాదాంతమని అర్థం "కుక్కలకు పోయింది" అంటే సర్వనాశనమై పోతున్నదని భావం. "నన్ను ప్రేమించు, నా కుక్కను ప్రేమించు" అనే సిద్ధాంతాన్ని కొందరు అనుసరిస్తారు. వారి అనుగ్రహం, దయ పొందాలంటే వారి స్నేహితు లందరినీ మన స్నేహితులుగానే అంగీరించాలని దబాయించి అడుగుతారు. 'కుక్క అవకాశం' కూడా లేదంటే చిట్టచివరి అవకాశం కూడా లేదన్నమాట!

కుక్కకు చెడ్డ పేరు ఇచ్చి తరువాత చేయి ఇవ్వటం అంటే ఒక వ్యక్తి నాశనమై పతన మయ్యేంత వరకు అపనిందలపాలు చేసి దూషించటం. గోడ దిగే మెట్ల వద్ద ఒక కుంటి కుక్కకు సహాయ పడటం - మంచి దిశకు మలుపు తిరగటం నిద్రించే శునకాలను అలాగే ఉండనివ్వాలని ఒక గొప్పరాజనీతివేత్త, దౌత్య నిపుణుడు సలహా ఇచ్చారు. 'డాగ్ - ఇన్ - ది - మేంగర్' విధానం అంటే మనం అనుభవించలేని ఆనందాన్ని ఇతరులు కూడ అనుభవించకుండా చేయటం.

డాగ్ - హెూల్ అంటే ఇరుకు గది కుక్క అలసట అంటే బాగా బడలిక పొందటం కుక్క నిద్ర అంటే తేలికగా, తగినంత నిద్రపోవటం ఒక పుస్తకం కుక్క వలె ఆర్జించినదంటే (dog earned) అనేకమంది అత్యాశ, ఆతురతగల పాఠకులు దాని పేజీలను బుక్ మార్క్స్ వలె వంచి వేయటం అని అర్థం. లొంగకుండా మొండిగా ఉండటాన్ని - 'డాగ్డ్' అని అంటారు. మంకుపట్టు, హఠం, మొండిపట్టు మరియు లొంగకుండా ఉండటం దీని అర్థాలు

ప్రజాస్వామ్యంలో ప్రతి పక్షం 'కావలి కుక్క' వలె ఉండాలి - జాతీయ ప్రయోజనాలను కాపాడేందుకు. డాగ్స్ ఆఫ్ వార్ - భూదగ్ధ విధానం వల్ల ఏర్పడే అగ్ని ప్రమాదాలు, కరవులు, సర్వనాశనం వంటి విధ్వంసక ప్రతి నిధులను నిర్దేశిస్తుంది.

## ఆంగ్ల భాషలో 800,000 మాటలు

*ఆంగ్లభాషలో అత్యధిక శబ్దజాలం ఉన్నది దీనిలో దాదాపు 800,000 మాటలు ఉన్నాయి*

'మనకు సంపద లభించాలని విధి ఉంటే నారికేళంలోని నీటివలే అది తెలియకుండానే వస్తుంది. అలాగే అది విడిచి వెళ్ళేటప్పుడు కరిభ్రమించిన

# నవ్వులో తేలిపోతూ చిరకాలం జీవించు

ఆర్.జి.కేశ్వాని

## పెళ్ళి లాటరీ లాంటిది!

ఒక యువకుడు వివాహం చేసుకోవాలని ఆలోచిస్తున్నాడు వివాహితుడైన ఒక మిత్రుణ్ణి అడిగాడు:



"వివాహం ఒక లాటరీ టిక్కెట్‌వంటిదని విన్నాను - నీవు అదృష్టవంతుడివి కావచ్చు, కాకపోవచ్చు. నీ అభిప్రాయం ఏమిటి?"

ఆమిత్రుడు జవాబిచ్చాడు, "నేను ఒప్పుకోను."

"ఎందుకు?"

"ఎందుకంటే లాటరీలో నీవు మళ్ళీ మళ్ళీ ప్రయత్నించవచ్చు గనుక!"

## ప్రత్యర్థి పేర పంపాను!

ఒక గ్రామీణుడు తన పొరుగు వానిపైన కేసు పెట్టాడు. అతడు తన న్యాయవాదితో చెప్పాడు: "ఈ కేసు ఓడిపోతానని భయంగా ఉంది, జడ్జీగారికి ఏదైనా కానుక పంపమంటారా?"

"వద్దు, అలా ఆలోచించవద్దు ఈ చాలా న్యాయమైనవాడు. నిన్ను క్షమించడు కూడా."

చివరికి గ్రామీణుడు కేసు గెలిచాడు అతడు తన న్యాయవాదితో చెప్పాడు "చూశారు గదా! నేను కేసు గెలిచాను! మీరు రానున్న ఆపదను ముందుగా ఊహించి చెప్పినా నేను ఒక కానుక జడ్జీగారికి పంపాను?"

"ఏమిటి? నీవు జడ్జీగారికి లంచం ఇచ్చావా?"

"అవును, నేను ఇచ్చాను, అయితే ఈ బహుమతిని నా ప్రత్యర్థి పేర పంపాను" అని చెప్పాడు గ్రామీణుడు.

## వృద్ధాప్యం వస్తుంది!

కాలేజీ నాటకాల్లో తన ప్రదర్శనలకు ప్రశంసలు పొందిన ఒక యువకుడు విజయ వంతుడైన నటుడుగా రూపొందాలనే అభి ప్రాయంతో కాలేజీ విడిచిపెట్టి ఫిలిం పత్రికల్లో తను చదివిన ఒక నిర్మాత పేరు వెదుక్కుంటూ బొంబాయి చేరుకున్నాడు

## ఎంత ప్రేమ పంచి పెట్టాము?

జీవితం చివరిలో మనకు దాని నుంచి ఎంత సంతోషం లభించిందని అడగకూడదు; మనం దానికి ఎంత సేవ చేశామని తప్ప ఎంతమేరకు పూర్తి విజయం సాధించామనే ప్రశ్న అడగకూడదు, ఎంత ఎక్కువ త్యాగాలు చేశామని తప్ప, ఎంత సుఖంగా ఉన్నామని కాదు, ఎంత మనం సహాయ పడ్డామని తప్ప, ఎంతమేరకు కోరికలు, ఆశలు సంతోష పెట్టాయని కాదు; ఎంత ప్రేమ పంచి పెట్టామని తప్ప.

"విశ్రాంతి తీసుకునేందుకు మీకు సమయం లేనప్పుడే విశ్రాంతి పొందేందుకు అనువైన సమయం."

ఈ యువకునితో మాట్లాడిన తరువాత ఆ నిర్మాత ఇలా చెప్పాడు:

"మీ అడ్రసు ఇచ్చి వెళ్ళండి ఒక వృద్ధుని పాత్రకు నటుడు కావలసి వచ్చినపుడు మిమ్మల్ని సంప్రదిస్తాము."

విభ్రాంతి చెందిన ఆ యువకుడు ఇలా అన్నాడు. "కానీ నేను యువకుణ్ణే."

నిర్మాత అతని మాటల్ని త్రోసివేస్తూ ఇలా అన్నాడు· "ఇప్పుడు యువకుడివే. నీకు పిలుపు వచ్చే సమయానికి వృద్ధాప్యం వస్తుంది!"

## డబ్బుకు కక్కుర్తిపడే నగరవాసులు

ఒక గ్రామస్థుడు ఢిల్లీ చూసేందుకు వెళ్ళాడు. అతని మిత్రుడు జంతు ప్రదర్శన శాల చూపిస్తున్నాడు జంతువుల్ని చూసేందుకు ప్రవేశ రుసుం చెల్లించటం ఆ గ్రామస్థుణ్ణి ఆశ్చర్యపర్చింది. తన మిత్రుని మనసులో బాగా నాటేందుకు వీలుగా అపురూప జంతువులు ఉండే ఒక గుహ దగ్గరకు తీసుకు వెళ్ళాడు

"చూడు, ఇది జీబ్రా (కంచర గాడిద). మీ గ్రామం అడవిలో దీన్ని ఎప్పుడూ చూసి ఉండవు."

గ్రామస్థుడు ఇలా చెప్పాడు "మూఢుని వలె మాట్లాడకు, డబ్బు సంపాదించేందుకు నగరవాసులు ఏదైనా చేస్తారు. వాళ్ళు కేవలం ఒక గాడిదపైన చాఱలరంగు పూశారు"

## ఇక్కడా అదే తిండి!

రెస్టారెంట్‌లో ఒక ఖాతాదారుడు· "ఇక్కడ ఏరకం ఆహారం అందిస్తారు?"

వెయిటర్ జవాబు "ఇంట్లో తయారైనట్లుగా ఆహారం అందించే హోటల్ మాది."

ఖాతాదారుడు కోపంతో. "ఈ ప్రపంచానికి ఏమివచ్చింది? ఇంటి భోజనం చేసి విసుగు చెందాను. ఇక్కడికి వచ్చినా అదే తిండి దొరుకుతున్నది"

—"బెటర్ లైఫ్" సౌజన్యంతో

## :ంటు ళృద్దాల ని



*అమెరికన్ రాజనీతివేత్త, స్వేచ్ఛా చింతనాపరుడు బెంజమిన్ ఫ్రాంక్లిన్ 1706 జనవరి 17న జన్మించాడు. తన 17వ ఏట ఫిలడల్ఫియాలో వృత్తి చేపట్టాడు. అతడు 1790 ఏప్రిల్ 17 న మరణించాడు. అతడు శాస్త్రవేత్త, తాత్త్వికుడు, గణిత శాస్త్రజ్ఞుడు, ఆర్థికవేత్త, సంగీతకర్త, ఖగోళవిజ్ఞాని, వాస్తుశిల్పి, సంపాదకుడు మరియు సైనికుడు. ఊగేకుర్చీ, హార్మోనిక, వీధిలాంతరు, సర్క్యులేటింగ్ లైబ్రరీ మరియు జంటకళ్ళద్దాలు - అతడే కనిపెట్టాడు. మెరుపు మరియు విద్యుచ్ఛక్తి యొక్క గుర్తింపు, గాలి వీచే ప్రథమ సాధనం, సూర్యకిరణాలలో విటమిన్సు, క్రమబద్ధమైన ఆహారం మరియు తాజా గాలిలోని ఉపయోగాలు - అతడే కనుగొన్నాడు!*

"మిత్రత్వం పింగాణి సామాను వంటిది, పెళుసైనది మరియు అరుదైనది.

## ఒలెగ్ పొపొవ్

అంటార్కిటికా 14 మిలియన్ చ.కి.మీ.ల ప్రాంతాన్ని ఆక్రమించుకుని ఉంటుంది. యూరప్ కంటే 50 శాతం విస్తారమైనది. ఆస్ట్రేలియావలె రెండింతలు విశాలమైనది. దీని మంచు కవచం దీన్ని ప్రపంచంలో ఉన్నతమైన ఖండంగా గాపొందించింది. దీని సగటు ఎత్తు రెండు లోమీటర్లు కాగా ప్రపంచంలో ఎత్తైన పర్వతాలు ల ఆసియాలో సగటు ఎత్తు 960 మీటర్లు మాత్రమే. అంటార్కిటికా ఉపరితలం - పపంచంలోని దీర్ఘమైన ఎత్తైన పీఠభూమికి ప్రాతినిధ్యం వహిస్తుంది ఇది టిబెట్ కంటే దునుంచి ఆరురెట్లుపెద్దది.

అంటార్కిటికా అంచులలోని బ్రహ్మాండమైన మంచు క్షేత్రాలలో సముద్రపు తుఫానులు, ప్రవాహాలు ఆకస్మికంగా విడివడి, తమవెంట డినీటిని తీసుకు వెళ్తాయి ఇవి సముద్రంలో మంచుకొండలవలె తేలియాడుతుంటాయి.

అంటార్కిటికా నుండి వచ్చిన ఒక మంచుకొండ 160 కి.మీ.ల పొడవు, 72 కి.మీ.ల వెడల్పు, 1 కి.మీ.లో 1/3 వంతు మందం కలిగి 2 ట్రిలియన్ 250 బిలియన్ టన్నుల బరువుతో ఉన్నది. దీన్ని ఆఫ్రికా వాయువ్య తీరానికి తీసుకువచ్చి, కరిగించినట్లయితే ఇది సహారా ఎడారికి ఎన్నో సంవత్సరాల వరకు మంచినీటి పారుదల సౌకర్యం కలిగిస్తుంది.

మొత్తాలలో బొగ్గు, ఇనుము, అయస్కాంత లోహాలు మరియు టిటానియం, మెగ్నీసియం - అంటార్కిటికాలోని అనేక ప్రదేశాలలో కనుగొన బడ్డాయి కొన్ని ప్రాంతాలలో యురేనియం, థోరియం, టాంటలం, వెండి, బంగారం, ప్లాటినం మరియు కోబాల్ట్ నిల్వలు కనిపించాయి. అంటార్కిటికా లోని వజ్రాలు దక్షిణాఫ్రికాలోని వజ్రాల వలే అమూల్యమైనవి.

అంటార్కిటికా అడుగు భాగం ఉష్ణప్రదేశ సంబంధమైన నదుల అడుగు భాగాలను - అతి చేరువగా - ప్రతిబింబిస్తుంది. చాలాచోట్ల ఒక చదరపు మీటర్లలో రెండు నుంచి మూడు కిలోగ్రాములు చేపలు, krill మరియు మొలుస్కులు కనుగొనబడ్డాయి. ఇటువంటి విలువగల ఆహారపు నీటిలో మనిషి సృష్టించిన "వ్యవసాయ క్షేత్రాలు" గణనీయమైన దిగుబడిని సాధించగలవు.

## ఈతలో అసమాన గౌరవం

*ఇంగ్లీష్ ఛానల్‌ను అడ్డంగానూ, పాల్క్ స్ట్రెయిట్స్, డార్డనెల్స్, స్ట్రెయిట్స్ (జలసంధి) ఆఫ్ జిబ్రాల్టర్ మరియు పనామా కాలువను ఈదిన అసమాన గౌరవం మిహిర్ సేన్ (పశ్చిమ బెంగాల్) పొందాడు.*

"మరో వర్తమానం మరెప్పుడూ ఉండకపోవచ్చు, నేను ఈ రోజే దాన్ని పూర్తిగా ఉపయోగించుకుంటాను, మరో 'నేను' మరెప్పుడూ ఉండక

కె.పి.ఎస్. మెనన

చైనాలో రాయబారిగా నా మొదటి నియామకం 1946 లో జరిగింది సరిగ్గా అప్పుడే జవహర్‌లాల్ నెహ్రూ తన మధ్యంతర ప్రభుత్వం ఏర్పాటు చేశారు కానీ ఇండియా అప్పటికి ఒక రిపబ్లిక్ కానీ, కేవలం ఒక డొమినియన్ (పరిపాలనాధికారం) కానీ కాదు. కనుక నా నియామక పత్రాలపై ఆరవ జార్జి చక్రవర్తి రెక్స్ ఇంపిరేటర్‌గా సంతకం పెట్టారు దీని క్రింది భాగంలో ఈ మాటలు ఉన్నాయి



పత్రంలో సమ్మతించినట్లు చేవ్రాలు చేసింది, జె. నెహ్రూ" ఈ నియామక పత్రాలలో ఇలా వ్రాయబడింది. "హిస్ మెజస్టీ (గౌరవనీయులైన చక్రవర్తి) మన విశ్వాసపాత్రుడైన ప్రేమాస్పదుడైన గౌరవనీయుడు కుమార్ పద్మ శివశంకర మీనన్, ఒక వివేకవంతుడు, శ్రద్ధగా పాటుపడే స్వభావం, వివేకం జాగరూకతగల వ్యక్తిగా ప్రత్యేక విశ్వాసం, నమ్మకం కలిగి ఉన్నారు" ఈ వర్ణనలో నన్ను నేను అరుదుగా గుర్తించుకోగల్గుతాను. నా గురించి చెప్పబడిన వాటన్నిటినీ నేను విశ్వసించడం జరిగితే నేనొక మానవాతీత వ్యక్తిగా భావించుకుని ఆ విధంగా ప్రవర్తించటం జరిగి ఉండేది. కానీ వీటిని నేను ఉప్పుగింజల వలే తీసుకున్నాను.

ప్రోటోకోల్ విషయాల్లో రాయబారులు బాగా అతుక్కుపోతారు ఒక ప్రోటోకోల్ విషయంలో ఏదో చిన్న పొరపాటు జరిగి జవహర్‌లాల్ నెహ్రూ ఇబ్బందిలో పడ్డారు నేను విదేశాంగ శాఖ కార్యదర్శిగా పనిచేస్తున్నప్పుడు ఒక ఉదయం టర్కీ రాయబార కార్యాలయం నుంచి ఒక కౌన్సిలర్ నా దగ్గరకు వచ్చి తమ రాయబారి గతరాత్రి అమర్యాదకు లోనయ్యాడని చెప్పాడు సంగతేమిటని అడిగాను. ప్రధానమంత్రి ఇచ్చిన ఒక విందులో టర్కీ రాయబారి కంటే స్వీడిష్ మంత్రికి అగ్రస్థానం ఇచ్చారని, ఇది మరేదేశంలోనైనా జరిగితే తమ రాయబారి విందును బహిష్కరించి వెలికి వచ్చేవాడని చెప్పాడు. ప్రోటోకోల్ ప్రకారం మంత్రికంటే రాయబారికే అగ్రస్థానం ఇవ్వవలసి ఉంటుంది. నేను ఈ విషయం ప్రధానమంత్రితో ప్రస్తావించగా ఆయన టర్కీ రాయ

## మన దేశంలో మొదటి మహిళా కళాశాల

*1879 మార్చి 4 న జోన్ బెథూన్ స్థాపించిన బెథూన్ కాలేజ్ ఆఫ్ కలకత్తా మనదేశంలో ప్రారంభమైన మొదటి మహిళా కళాశాల అప్పట్లో బ్రిటన్‌లో తప్ప మిగిలిన బ్రిటిష్ పాలనలో ఉన్న దేశాల్లో వెలసిన మొదటి మహిళా కళాశాల కూడా ఇదే*

"గొప్పతనం - దృఢత్వంలో లేదు, దృఢత్వాన్ని సక్రమంగా ఉపయోగించుకోవటంలోనే ఉన్నది."
— హెన్రీ వార్డ్ బీచర్

బారికి - ఒక నిరాయుధుణ్ణి చేసే లేఖ వ్రాశారు. రాయబారిని అగౌరవ పరచాలనే కోరిక తనకు ఎంతమాత్రం లేదని, తాను, తన సహచరులు తమ చురుకైన జీవితంలో ఎక్కువ భాగం జైళ్ళలోనే గడిపామని, జైళ్ళలో ప్రోటోకోల్ అనేది ఉండదని వ్రాశారు. దీనికి రాయబారి సమాధానపడి జవహర్‌లాల్ నెహ్రూకు ఒక గౌరవ పూర్వకమైన ప్రత్యుత్తరం వ్రాశాడు.

ఒక్కొక్కసారి రాయబారులు రెండు చేతులతో సాహసం ప్రదర్శించి ప్రోటోకోల్‌ను బాహాటంగా ధిక్కరించటం జరుగుతుంది. నేను చైనాలో ఇండియాకు ఏజెంట్ జనరల్‌గా పనిచేస్తున్నప్పుడు 1943లో ఛుంగ్‌కింగ్‌లో ఇది జరిగింది ఇండియా స్వాతంత్ర్యం పొందనందువల్ల, ఆదేశపు ప్రతినిధిని రాయబారి అనీ, మంత్రి అనీ పిలవటం జరగదు. సోవియెట్ రాయబారి పనియుష్కిన్ నన్నూ, నాభార్యనూ విందుకు ఆహ్వానించాడు. ఆ విందులోని మరో సీనియర్ అతిథి చైనాలో టర్కీ రాయబారి. పనియుష్కిన్ నన్ను అతిథేయురాలికి కుడి ప్రక్కగా కూర్చోబెట్టాడు. టర్కీ రాయబారిని ఎడమప్రక్కన కూర్చుండబెట్టాడు తనపట్ల చూపిన ఈ అమర్యాదకు టర్కీ రాయబారి తీవ్రంగా నిరసన ప్రకటించాడు కేవలం ఒక ఏజెంట్ జనరల్‌కు ఒక రాయబారి కంటే అధికుడుగా ఉండే హక్కు లేదన్నాడు దీనికి సోవియెట్ రాయబారి జవాబిస్తూ ఇదొక క్రమపద్ధతి లేని విందు మాత్రమేనని, తాను ఇండియా ప్రతినిధికి గౌరవస్థానం ఇవ్వటానికి కారణం - రెండవ ప్రపంచ యుద్ధంలో - అప్పటికి యుద్ధం - జరుగుతూనే ఉన్నది - మిత్రరాజ్యాల పక్షాన ఇండియా ధైర్యంతో పోరాడుతుండగా టర్కీ గోడమీది పిల్లిలా కూర్చుని ఉండటమేనని - చెప్పాడు.

ఒక్కొసారి రాయబారుల భార్యలు తమ భర్తలకంటే తమ హోదా, తమ దేశం హోదా గురించి ప్రత్యేక శ్రద్ధ చూపుతుంటారు. ఢిల్లీలోని ఒక రాయబారి భార్య - తనదేశపు హోదా పట్ల ఒక పట్టాన తృప్తిపడని యువతి ఢిల్లీలోని ఏ నివాసగృహం - నిజాం ప్రాసాదం తప్ప - తనకు తగినది కాదని చెప్పేది ఇండియాకు చెందిన ప్రతిదాన్నీ ఆమె వాసన పట్టేది ఒకసారి ఆమె కోణార్క్ నుంచి తిరిగి వచ్చి, అక్కడి ధ్వంసమైన నిర్మాణాల పట్ల క్రోధం ప్రదర్శించి, ఎవరో ఒకరు వాటిపైన బాంబువేస్తే బాగుంటుందని తాను కోరుతున్నట్లు నాతో చెప్పింది

మహిళలు మంచి రాయబారులు కాగలరా



*ప్రతి సంవత్సరం ఏప్రిల్ 22వ తేదీ పృథివీ దినంగా పరిగణించబడుతున్నది భూమిపై మానవ ప్రాణుల వల్ల సంభవిస్తున్న పరిసరాల సమస్యలను దృష్టికి తెచ్చేందుకు అమెరికాలోని ఒక ప్రజా కూటమి 1970లో మొదటిసారిగా ఈ పృథివీ దినం పాటించింది ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా - పాఠశాలల పిల్లలు, కవులు, కార్యశీలురు, గృహిణులు - దీన్ని జరుపుకుంటున్నారు*

*— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో*

"నీవు మదింపు చేయబడవని మదించవద్దు."

అని ఒక్కోసారి అడుగుతుంటారు. మంచం ప్రక్కభాగపు పద్ధతులు వారికి ఉన్నాయి ఈ పద్ధతులు ఒక్కోసారి రాయబారికీ, డాక్టర్‌కూ ఉపయోగిస్తాయి అంతేకాక, మహిళలకు భాషల నేర్పుపట్ల ప్రావీణ్యం ఉంటుంది అయితే మాట్లాడే ప్రావీణ్యం ఒక్కోసారి చాలాదూరం తీసుకుపోతుంది. ఒకసారి లండన్‌లోని ఫ్రెంచి రాయబారి ఆరుభాషల్లో మాట్లాడే ప్రావీణ్యం గల ఎలిజబెత్ రాణిని అభినందించాడు. "నిజమే, మహిళ మాట్లాడటంలో ఆశ్చర్యమేమీ లేదు, తననోటిని అదుపులో పెట్టుకోవటమే ఆమెకు అతి కఠినమైన పని" అని రాణి జవాబిచ్చింది. కేవలం స్త్రీలే మాట్లాడుతూ ఉండరు. పురుషులు కూడా మాట్లాడుతుంటారు. పనిలేని వ్యర్థ ప్రసంగాల పట్ల ప్రత్యేక ఆసక్తి కలిగినందు వల్లనే పురుషులు మాట్లాడరు. పురుషులు మాట్లాడేది - కోడిపుంజువలె - వారు ప్రదర్శించ దలచేది, తాము ఉపదేశింపబడేవారు కాదని చెప్పేందుకే. ఈ విధంగా చేయటం ద్వారా తమ దేశపు రహస్యాలను బహిర్గతం చేసే మనసుగల వారుగా మారి తమ ప్రభుత్వాన్ని తత్తర పరుస్తారు, తమ ప్రభుత్వపు అక్కఱలకు భంగం కలిగిస్తారు.

ఎక్కువగా మాట్లాడే మన రాయబారులు స్వభావం గురించి ఒకసారి జవహర్‌లాల్ నెహ్రూ ఉద్వేగం పొంది పార్లమెంట్‌లో ఇలా చెప్పారు: "రాయబారి తన కళ్ళూ, చెవులూ తెరచుకుని, నోటిని మూసుకుని పనిచేయాలి."

నేను ప్రస్తావించిన అనేక లోపాలు తనని పెద్దగా భావించుకునే రాయబారి దృష్టివల్ల సంభవించేవే. ఒక పర్యాయం లెనిన్‌గ్రాడ్‌లో ఒక వృద్ధ స్త్రీ నన్ను సరైన స్థానంలో పెట్టటం జరిగింది. మేము లెనిన్‌గ్రాడ్ సందర్శిస్తున్నప్పుడు ఆమె మా రష్యన్ దుబాసి వలియాను నేనెవరని ప్రశ్నించింది. "ఆయన సోవియెట్ యూనియన్‌లో ఇండియాకు చెందిన ఒక అసాధారణ రాయబారి మరియు పూర్తి అధికారాలు గల మంత్రి" అని వలియా చెప్పగా ఆ వృద్ధ స్త్రీ "అవును, అవును" అంటూ అసహనంతో ఇలా ప్రశ్నించింది; "కానీ ఆయన చేస్తున్న దేమిటి?" ఒక రాయబారి ఎప్పటికప్పుడు ఈ ప్రశ్న తనకు తాను వేసుకున్నట్లయితే అతనికి మేలు జరుగుతుంది.

- "ఆకాశవాణి" సౌజన్యంతో

## బుద్ధుడు లేక క్రీస్తు సుభాషితాలు




*బుద్ధుడు లేక క్రీస్తు రెండు వేల సంవత్సరాల క్రితం లేదా ఇంకా వెనుకటి కాలంలో ప్రవచించిన కొన్ని మాటలు లోతైన భావం కలిగి ఈనాటికి కూడా ఆమోదయోగ్యంగా ప్రకాశిస్తున్నాయి వాటికి కాలమూ మరియు వ్యవధి తాకని ఒక శాశ్వతత్వం ఉన్నది.*

*— జవహర్‌లాల్ నెహ్రూ*

"తెలివిగల వాళ్ళు ఇతరుల తప్పుల వలన పాఠాలు నేర్చుకుంటారు, మూర్ఖులు తమ సొంత తప్పుల వలనే పాఠాలు నేర్చుకుంటారు" •

[illegible]

డా.డి. సాంబశివరావు

కారట్ (ఎఱ్ఱముల్లంగి)కి మూల స్థానాలు - యూరప్, నైరుతి ఆసియా మరియు ఆఫ్రికా ఖండాలు తీపి స్వభావం కలిగిన కారట్ అసంఖ్యాకమైన - పలురకాలుగా - నాన్‌టిస్, నాన్‌టిస్ హాఫ్‌లాంగ్ మరియు పూసా కాసర్ - వస్తున్నది దీని ఆకులు కూడా తినదగినవే.




కారట్ మొక్క శీతల వాతావరణంలో బాగా పెరుగుతుంది. అన్ని ఋతువుల్లోనూ, ఇండియాలోని అన్ని ప్రాంతాలలో లభిస్తుంది.

వండిన కారట్ లేదా ముడి కారట్ భుజిస్తే "విటమిన్ ఏ" - క్రొవ్వు కరిగించే విటమిన్ - బాగా లభిస్తుంది. శరీరానికి లభించే కారొటిన్ 'విటమిన్ ఏ'గా కారొటనోస్ కార్యకలాపం ద్వారా ప్రేగుల్లోని గోడల్లో మార్పు చెందుతుంది. 'విటమిన్ ఏ'లోని ప్రధాన భాగం అనగా 95 శాతం కాలేయంలో నిల్వ ఉంటుంది. మిగిలిన భాగం మూత్ర పిండాలలో మరియు ఊపిరితిత్తులలో నిల్వ ఉంటుంది.

ఎముకలు మరియు దంతాల సాధారణ పెరుగుదలకు, అభివృద్ధికి 'విటమిన్ ఏ' ఎక్కువగా తోడ్పడుతుంది. శ్లేష్మం (తెమడ) ఉత్పత్తి స్థానాన్ని పురికొల్పే కారణాలపై ప్రభావం చూపుతుంది. నోటిలోని తెమడగల పొరలను సరిదిద్దుతుంది. కడుపు నొప్పికి సంబంధించిన ఆంత్రవ్యాధులు, శ్వాసక్రియ, మరియు జననేంద్రియ సంబంధమైన మూత్ర (ద్వార) వ్యాధులను సరిదిద్దుతుంది.

## జీవితం ఒక అపురూప కానుక



జీవితం - సౌందర్యవంతమైనది
జీవితం - అమృతం
జీవితం - తియ్యనిది
దేవుడు దీన్ని నడిపించినప్పుడు
ఇది ప్రేమ, శక్తి, ఆనందం ప్రసరింప చేస్తుంది
దీని కాంతి అందరిపై ప్రకాశిస్తుంది
ఉద్వేగపర్చే చర్యలలో అది విడిపోతుంది
స్వచ్ఛం, నిస్స్వార్థం మరియు ఘనం -
జీవితం ఒక కానుక - అమూల్యమైనది, పోల్చలేనిది
దీన్ని దీవించబడేదిగా, పవిత్రమైనదిగా రూపొందించండి.

— స్వామీ రామదాస్

"తన తోటి వారి సంక్షేమానికి ఏ శ్రేణిలో ఒక మనిషి కృషి చేస్తాడో అతడు అంతటి గొప్పవాడవుతాడు."

"విటమిన్ ఏ" లోపం వల్ల రేచీకటి మరియు పిల్లలేని పరిస్థితి ఏర్పడుతుంది. దీని ఫలితం దీర్ఘకాలపు అతిసారం, తీవ్రమైన కడుపు నొప్పి (శూల) వగైరాలకు దారి తీస్తుంది

కారట్‌లో అత్యధిక మొత్తాలలో థియమిన్ బి1) మరియు రిబోఫ్లావిన్ (బి2) ఉన్నాయి. వి ప్రేగులలోకి గ్రహించబడి లివర్ (కాలేయం)కు ేర్చబడతాయి. కాలేయంలో ఇవి ఫాస్పేట్స్కు, ుగ్నీసియంలతో మిళితమై చురుకైన ఎన్ ములుగా రూపొందుతాయి ఇవి కార్బో హైడ్రేట్ లోహాలకు సహాయపడతాయి. ఇవి ఒవిధంగా సక్రమమైన ఆకలి కలిగేటట్లు హూస్తాయి. మరియు కడుపు నొప్పికి ంబంధించిన ఆంత్రమార్గం యొక్క కండరాలను ిరిచేస్తాయి. పక్షవాతం వంటి బల హీనమైన ండరాల పరిస్థితిని చక్కబరుస్తాయి. ిటమిన్ బి1 లేకపోతే - బెరిబెరి, గుండె పెరుగుదల మరియు అధికంగా గుండె కొట్టు ోవటం - ఇవన్నీ వస్తాయి.

మలబద్ధాన్ని అరికట్టే ఎక్కువ ముతక పదార్థం మరియు మెగ్నీషియం కారెట్‌లో అధికంగా ఉన్నది.

కారెట్ రసం అత్యంత చికిత్సా విలువలు కల్గి ఉన్నది. అనేక వ్యాధుల నుండి రక్షంచటమే కాక కారెట్ ఉపయోగాలు ఇవి: (1) అధిక లవణసారం కల్గినందువల్ల క్రిములు చేరి మాంసం కుళ్ళిపోకుండా చేస్తుంది. (2) కళ్ళకు పనికి వస్తుంది. (3) బలం, శక్తి, జీవం, పుంసత్వం పెంపొందించే ప్రతినిధిగా పని చేస్తుంది. (4) తల్లులను మరియు బిడ్డలను పోషించి కాపాడే విటమిన్ ఏకు మూలాధారంగా ఉంటుంది.

## అత్యధిక అల్లం ఉత్పత్తి చేసే కేరళ

*ఇండియాలో అత్యధికంగా అల్లం ఉత్పత్తి చే రాష్ట్రం కేరళ మొత్తం ఉత్పత్తిలో 35 శాత ఇక్కడ లభిస్తుంది ప్రపంచ విపణుల్లో విశేషాదర పొందిన వాటిల్లో కొచ్చిన్ మరియు కోజికోడ్‌ల ఎండ అల్లం కూడా ఉన్నది.*

*- (ఎకనమిక్ టైమ్*

## బొగ్గులో వివిధ రకాలు

*ఇండియాలో లభించే వివిధ రకాల బొగ్గు పీట్ (60 శాతం కార్బన్), లిగ్నైట్ (70 శా కార్బన్), బిటుమినస్ (78 శాతం కార్బన్), సె. బిటుమినస్ (83 శాతం కార్బన్) మరియు ఆం సైట్ (90 శాతం కార్బన్)*

## క్రుళ్ళిపోయినందున పండ్లు, కూరగాయలకు ఏర్పడే నష్టం



*ఇండియాలో 5 మిలియన్ హెక్టార్లలో దాద 54 మిలియన్ టన్నుల పండ్లు, కూరగాయ పెంచబడుతున్నాయి. కానీ ఇవి వినియోగదారు చేరేలోగా క్రుళ్ళిపోయినందువల్ల ఉత్పత్తిలో నుంచి 30 శాతం వరకు నష్టపడటం జరుగుతుంది.*

*- 'సైన్స్ రిపోర్టర్' సౌజన్య*

"నీవు పరాజయం పొందినట్లయితే ఆశాభంగం చెందవచ్చు కానీ నీవు ప్రయత్నమే చెయ్యకపోతే నశించిపోతావు."

## స్వర్గీయ ఎస్. బాలకృష్ణ జోషి

తమ వంతు భాగంగా తల్లిదండ్రులు విద్య పట్ల మిక్కిలి ఆసక్తి కనబర్చాలి తమ పిల్లల బోధన రుసుం చెల్లించిన క్షణంలోనే తమ బాధ్యత తీరిపోయిందనే అభిప్రాయాన్ని వీరు విడనాడాలి. వివేకులైన పౌరులుగా తమ బిడ్డలు వారి కోసం ఎదురుచూస్తున్న కార్య భారాన్ని మోయగల శిక్షణ ఎలా పొందుతున్నారో తెలుసుకునే హక్కు కలిగి ఉన్నారు. అనవసర జోక్యం లేకుండా విద్యా సంస్థల అభివృద్ధి కృషిలో పాలుపంచుకోగల అవకాశం వారికి ఉన్నది. ఉచిత విద్య పొందుతున్న బిడ్డలు ఉన్న చోట తల్లిదండ్రుల బాధ్యత ఎక్కువగా ఉంటుంది. ప్రభుత్వం రుసుం చెల్లించనక్కర లేదని వీరిని మినహాయించినప్పుడు, పన్ను చెల్లింపు దారుల నుంచి ఆ డబ్బును పాఠశాలలకు చెల్లిస్తారనే విషయం తల్లిదండ్రులు గ్రహించ వలసి ఉంటుంది. ఈవిధంగా తల్లిదండ్రులు సంఘానికి ఋణపడి ఉంటారు, తమ పిల్లలు పాఠశాలలో అత్యధిక ప్రయోజనం పొందేందుకు వీరు తోడ్పడినట్లయితే తమ బాధ్యత సక్రమంగా నెరవేర్చినవారవుతారు. సమాజసేవలో ఉత్తమ శ్రేణికి చెందిన జ్ఞానం, శీలం ఉపయోగించటం - ప్రత్యేక సదుపాయం ఉచిత విద్య పొందిన విద్యార్థుల నుంచి ప్రతిఫలంగా ఆశిస్తున్న అంశం. సమాజంలో ఉపాధ్యాయులు కూడా ప్రధానమైన సభ్యులని తల్లిదండ్రులు గుర్తించాలి. ఉపాధ్యాయుల ఆర్థిక పరిస్థితిని సాకుగా తీసుకుని తల్లిదండ్రులు తమ పిల్లల కృత్రిమ అభివృద్ధి కోసం అవినీతికరమైన

## నీవు స్వయంగా భగవంతుడివే

*స్వామీ వివేకానంద ఖేత్రీ (రాజస్థాన్)లో ఒక గదిలో బస చేసేవారు. ఆధ్యాత్మిక సలహాల కోసం అనేకులు అక్కడికి వస్తుండేవారు ఒకసారి ఒక అంత్య కులీనుడైన చెప్పులు కుట్టేవాడు అక్కడికి వచ్చి రెండు చేతులు జోడించి ఇలా అన్నాడు "స్వామీ! మూడు రోజుల నుంచి మీరేమీ భుజించ లేదు. కేవలం మంచినీటినైనా తీసుకున్నారా లేదా? అని నేను ఆశ్చర్యపోతున్నాను "*

*"అవును సోదరా! నాకు ఆకలిగా ఉంది నీవు నాకు ఏదన్నా తినేందుకు ఇవ్వగలవా?" అన్నారు స్వామి*

*"స్వామీ! నేను మీకు ఆహారం ఇచ్చేందుకు ఎంతో ఆనందపడతాను. కాని నేను అంత్య కులజుణ్ణి, చెప్పులు కుట్టేవాణ్ణి. నేను ఇచ్చే ఆహా రాన్ని మీరెలా భుజిస్తారు?"*

*"ఏమీ విచారించవద్దు బిడ్డా! ఆహారాన్ని తీసుకురా నేను భుజిస్తాను. నీవు స్వయంగా భగవంతుడివే". అన్నారు స్వామి*

*సంతోషంతో చెప్పులు కుట్టే వ్యక్తి ఇంటికి వెళ్ళి వండిన అన్నాన్ని తెచ్చాడు. స్వామి ఎంతో ఆనందంతో భుజించారు.*

[illegible]

పద్ధతులకు వారిని పురికొల్పటం సక్రమం కాదు.

ఇక ఉపాధ్యాయులు, ప్రతిక్షణం తమ కర్తవ్యం పవిత్రమైనదనీ, శీలం తమ శక్తికి కోట వంటి దనే గమనికతో ఉండాలి. ఒక అపరాధం చేస్తే ఏ పరిస్థితి కూడా వారిని నిర్దోషిగా విముక్తం చేయలేదు. తమ అంతరాత్మను తాకట్టు పెడితే వారు సమాజపు నైతిక ఆరోగ్యానికి కంటక ప్రాయంగా తయారవుతారు

తమ గౌరవనీయమైన శ్రమకు తగినంత ఫలితం లభించలేదని దుఃఖించినందువల్ల తమకు కానీ, ఇతరులకు కానీ ఒనగూడేదేమీ ఉండదు. విద్యుక్త ధర్మనిర్వహణకు అంకిత మైన ఒక సేవకుని వ్యక్తిత్వాన్ని గౌరవించి, ఇతర రంగాలలో పనిచేస్తున్న వారితో సమానంగా అతణ్ణి నిలబెట్టలేనప్పుడు ఒక ప్రజాస్వామ్య వ్యవస్థ ఆత్మద్రోహానికి లోనవు తుంది. పాఠశాలల్లో తర్ఫీదు ఇచ్చి తారతమ్యం తెలుసుకునే వ్యక్తులను తయారు చేసి వారి ద్వారా ప్రజాభిప్రాయాన్ని ఆఖరికి రూపొందించే వ్యక్తి ఉపాధ్యాయుడే. ఒక ఆరోగ్యవంతమైన ప్రజాస్వామ్య వ్యవస్థలో ఉపాధ్యాయుడు సముచిత స్థానం అలంకరిస్తాడనడంలో ఏవిధమైన సందేహం అక్కరలేదు. అతడు తన గౌరవం నిలబెట్టుకోదలచుకుంటే ఇతరుల దయాదాక్షి ణ్యాలకు తలఒగ్గకుండా, పైకి ప్రాకి పోయేందుకు అమర్యాదకరమైన పద్ధతులకు పూనుకోకుండా ఉండాలి. అధ్యాపకత్వం నేడు బోధన కంటే ప్రభావం ఎక్కువ కలదిగా ఉండాలి కనుక ఉపాధ్యాయులు భవిష్యత్ ప్రజాస్వామ్య రూపురేఖలు దిద్దవలసిన తమ శిష్యులకు అర్హతగల దృష్టాంతాలుగా ఉండవద్దా?

— 'మీరా' సౌజన్యంతో

## సిత్రః వివేకం!



*ఇంపుగా వ్యవహరించు*
*సక్రమంగా తెలుసుకో*
*జాగ్రత్తగా స్నేహితం చేసుకో*
*యుక్తిగా సర్దుబాటు చేసుకో*
*శ్రద్ధగా చదువు*
*క్రమబద్ధంగా ఉపవాసం చెయ్యి*
*నేర్పుగా దుస్తులు ధరించు*
*సంపూర్ణంగా గమనించు*
*కళాత్మకంగా సృష్టించు*
*తేలికగా ప్రయాణించు .*
*జాగ్రత్తగా పనిచేయి*
*సుఖంగా విశ్రాంతి తీసుకో*

*— సాకో వి.హెచ్. స్టీఫెన్*

## మూడు అవధుల జీవితం

*జీవితం మూడు నిర్ణీత కాలాలుగా*
*విభజించబడింది - ఏది ఉండేది?*
*ఏది ఉన్నది? ఏది ఉంటుంది?*
*గతం నుంచి మనం నేర్చుకుని వర్తమానంలో*
*లాభం పొందాలి. వర్తమానం నుంచి*
*భవిష్యత్తులో బాగా జీవించేందుకు నేర్చుకోవాలి.*

*— బిల్లింగ్స్*

'కష్టాలు మనిషిని చితకకొట్టలేవు - అతణ్ణి తయారు చేస్తాయి.''

# చార్లెస్ డార్విన్

చార్లెస్ డార్విన్ ప్రతిపాదించిన విప్లవాత్మకమైన పరిణామక్రమ సిద్ధాంతం పట్ల ప్రపంచమంతటా చెలరేగిన వాదోపవాదాలకు 19వ శతాబ్ది సాక్షిగా నిల్చింది జీవించే వివిధ వర్గాలు, తమ ప్రస్తుత రూపాన్ని దీర్ఘమైన క్రమానుగతమైన ఒక పరిణామక్రమం ద్వారా సాధించుకున్నాయని ఈ సిద్ధాంతం వెల్లడిస్తుంది



1809 ఫిబ్రవరి 12న ఇంగ్లండ్‌లోని ష్రూస్‌బరీలో డార్విన్ జన్మించాడు. ఇతని తండ్రి రాబర్ట్ డార్విన్ ఒక వైద్యుడు, ఇతని తాత ఎరస్మస్ డార్విన్ సుప్రసిద్ధ కవి, వైద్యుడు మరియు చింతనాపరుడు. ఇతడు కేంబ్రిడ్జిలో విద్యాభ్యాసం చేశాడు అక్కడ వృక్షశాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ హెన్‌స్లో మిత్రత్వాన్ని పొందాడు. అతని ద్వారా బీగిల్ అనే నౌకలో జీవశాస్త్ర పరిశోధకుని హోదా పొందాడు. ఇదే తరువాత ప్రపంచం చుట్టూ ఐదేళ్ళపాటు సాగిన శాస్త్ర విజ్ఞాన సాగర యాత్రగా మారింది.

ఈ సాగర యాత్రా సమయంలో యువకుడైన డార్విన్ వేలాది జంతువుల మరియు మొక్క[ల] నమూనాలను అధ్యయనం చేశాడు. 1859[లో] ప్రచురించబడిన అతని ప్రసిద్ధ గ్రంథం "[ది] ఆరిజిన్ ఆఫ్ స్పీసీస్"కు ఇది ఎంతో సామ[గ్రిని] అందించింది తను వ్రాసిన దా[నిలో]ని సత్యాన్ని ఋజువు పర్చుకున్నా[నని] డార్విన్ హృదయపూర్వకంగా విశ్వసించాడు.

ప్రపంచం ఇంతకు ముందెన్నడూ చూడ[ని] ఒక గొప్ప. జీవశాస్త్ర పరిశోధకుడుగానే కా[క] అంతకు క్రితం ఎన్నడూ పుట్టి ఉండని ఒ[క] పరిపూర్ణమైన సజ్జనుడుగా అతడు రూపొందాడ[ు] జీవిత పర్యంతరం బాధించిన రుగ్మత నుం[డి] - సత్యం పట్ల తనకు గల ఆవేశపూరిత ప్రే[మ] ద్వారా, ప్రకృతికి సంబంధించిన పనుల[ందు] గొప్ప ఆసక్తి ప్రదర్శించడం ద్వారా - ఘ[న] విజయం సాధించాడు

డార్విన్ పరిణామ క్రమ సిద్ధాంత[ం] ఇప్పటికీ చర్చనీయాంశంగా ఉన్నప్పటికీ నే[డు] పరిణామ సిద్ధాంతంలోని సాధారణ భావన[ను] సైన్స్ ప్రతిచోట ఆమోదించింది అత[ని] సిద్ధాంతంలోని ఒక భాగం తిరస్కరిం[చ] బడింది లేదా ఇతర సిద్ధాంతాలు తీసు[కో] బడటం జరిగింది. కానీ దాని మూల సూత్రా[లు] శాస్త్రవిజ్ఞాన ప్రపంచమంతటా వ్యాపించాయ[ి] తన 73వ ఏట 1882 ఏప్రిల్ 19న డార్వి[న్] కన్నుమూశాడు.

— రెగి జె. తునియంప్రా[క్]

— 'ఇన్‌స్పిరేషనల్ కోట్' సౌజన్యం[తో]

"ఒక ఉపాధ్యాయుడు శాశ్వతత్వంపై ప్రభావితం చూపుతాడు. తన ప్రాబల్యం ఎక్కడ నిల్చిపోతుందో అతడు ఎన్నటికీ చెప్పడు."

1856 జులై 26న డబ్లిన్‌లో జార్జి బెర్నార్డ్‌షా జన్మించాడు. ఆంగ్ల సారస్వతంలో తన సొంత శైలి సృష్టించుకున్న గొప్ప ఐరిష్ వారిలో అతడు ఒకరు: నాటకాలకు సంబంధించినంతవరకు అతడు షేక్స్పియర్‌కు ద్వితీయుడుగా నిలబడతాడు.


George Bernard Shaw

15వ ఏడు వచ్చేవరకు బెర్నార్డ్‌షా తన పాఠశాల చదువు డబ్లిన్‌లో కొనసాగించాడు. ఆ తరువాత ఒక గుమాస్తాగా, అనంతరం ఒక భూప్రతినిధి కార్యాలయంలో కాషియర్‌గా పని చేశాడు. 1876లో తన తల్లితో కలిసి లండన్ వెళ్ళేంతవరకు ఆ ఉద్యోగంలోనే కొనసాగాడు.

1885 నుండి 1908 వరకు అతడు పాత్రికేయుడుగా ప్రసిద్ధి చెందాడు. ఒక సంగీత విమర్శకునిగా అతడు "సాటర్‌డే రివ్యూ" అనే వార పత్రికకు వ్రాస్తుండేవాడు. 1885లో నాటక రచనలో తన మొదటి ప్రయత్నం చేశాడు. సంగీత నాటకాల ప్రభావం అతని నాటకాల్లో బాగా కనిపిస్తుంది. అతనికి గణ్యత కలిగించే 50 నాటక సంబంధమైన రచనలు చేశాడు. వీటిల్లో ప్రసిద్ధమైనవి: "మిసెస్ వారెన్స్ ప్రొఫెషన్", "ఆర్మ్స్ అండ్ ది మాన్", "ది డెవిల్స్ డిసైపుల్స్ అండ్ రివెంజ్." 1905 నాటికి జీవించి ఉన్నవారిలో అత్యంత ప్రసిద్ధి చెందిన నాటక కర్తగా షా రూపొందాడు.

1922లో "సెయింట్ జోన్"తో అతని కీర్తి శిఖరాగ్రానికి చేరుకున్నది. రచయిత యొక్క మతపరమైన విషయం వైపు క్షణకాల దర్శనం ఈ రచనలో స్పష్టంగా కనిపిస్తుంది. 1932లో అతడు ప్రపంచయాత్ర చేశాడు. ఆ సమయంలోనే బొంబాయిని సందర్శించాడు.

1950లో తన 95వ ఏట షా కాలధర్మం చెందాడు. "ది ఆపిల్ కార్ట్" అనే ప్రధానమైన నాటిక తుదిసారి తయారు చేశాడు. సాహిత్యంలో సౌందర్యాన్నీ, శ్రేష్ఠతనూ ప్రేమించేవారి హృదయాలలో ఈ బుద్ధి కుశలతగల నాటక రచయిత వేసిన ముద్రలు ఎన్నటికీ చెరిగిపోవు.

— బెంజమిన్ కిరో

— "ఇన్స్పిరేషనల్ కోట్" సౌజన్యంతో

## మృదువుగా ఉండండి

*యువతవట్ల మృదువుగా ఉండేందుకు,*
*వృద్ధులవట్ల దయాళువులుగా ఉండేందుకు,*
*ప్రయాసవడే వారివట్ల సానుభూతితోనూ,*
*బలహీనులు, తప్పులు చేసిన వారివట్ల*
*సహనశీలతతోనూ ఉండేందుకు*
*తీర్మానించుకోండి జీవితంలో ఏదో*
*ఒక సమయంలో మీరు ఇవన్నీ కలిసి ఉంటారు.*

"పదవులు, బిరుదులు కలిగి ఉన్నందువల్ల గౌరవం రాదు. వాటికి తాను యోగ్యుడవటంలోనే ఆ గౌరవం లభిస్తుంది"

ఒక సాధారణ ఆధునిక గోవు ప్రతిరోజు 5 నుంచి 20 కి.గ్రా.ల పాలు ఉత్పత్తి చేస్తుంది. శ్రేష్ఠమైన ఆవులు రోజుకు నాలుగు రెట్లు పాలు ఇస్తాయి. ఇలా ఒక సంవత్సరంలో 180 నుంచి 320 రోజులపాటు ఇస్తాయి.




మూడు లేక నాలుగేళ్ళ వయస్సుగల ఉత్తమ తెగకు చెందిన ఆవుదూడలు 500, 600 కి.గ్రా.ల బరువు ఉంటాయి. కొన్ని ఒక టన్ను బరువు కూడా ఉండవచ్చు.

తన జీవిత పరిధి అయిన 20 ఏళ్ళలో ఒక ఆవు 12 నుంచి 13 సంవత్సరాల పాటు ఒక 'పాల ఫ్యాక్టరీ' గా పనిచేస్తుంది. ముసలి ఆవులో పాల దిగుబడి తగ్గుతుంది ఉదాహరణకు: నిరంతరం నెమలటం దంతాలు అరిగిపోయేటట్లు చేస్తుంది. నియమానుసారం - ఒక ఆవు ప్రతి సంవత్సరం ఒక దూడకు జన్మనిస్తుంది, (అసాధారణంగా రెండు దూడలు మరింత అసాధారణంగా ఒకేసారి ఏడుదూడలు కూడా పుట్టవచ్చు.)

ఇతర పశువుల్లో కంటే ఆవులో వాసన పట్టే స్వభావం తక్కువ అయితే వెయ్యి దూడల మధ్య నుంచి కూడా తన సొంత దూడను గుర్తించి వెలికి తెచ్చుకోగల శక్తి దీనికి ఉన్నది

పశువులు మేసే స్థలంలో మేత మేసే ముందు ఆవు నేలను జాగ్రత్తగా వాసన చూస్తుంది. - గడ్డిని కాక కేవలం నేలనే వాసన పడుతుంది. అక్కడ ఖనిజ సంబంధమైన ఎరువులను ఆవు కనుగొన్నట్లయితే అక్కడ మేత మేసేందుకు తిరస్కరిస్తుంది.

గడ్డి మేసే అన్ని పశువుల మాదిరిగానే ఆవులు కూడా తన శరీరంలో ఉప్పుకొరత ఏర్పడిన భావం రాగానే ఉప్పును పేరాశతో నాలుకతో నాకుతుంది. కానీ ఉప్పు, పులుపు, చేదు మరియు తీపి - వీటిల్లో దేనినైనా కోరుకోమంటే ఆవు తీపినే ఎంచుకొంటుంది

## తొమ్మిదేళ్ళ వయసులోనే విమానాన్ని నడిపిన రాచెల్

*అమెరికాకు చెందిన రాచెల్ కార్టర్ తొమ్మిదేళ్ళ వయసులోనే 8,859 కి.మీ.ల దూరం విమానాన్ని నడిపిన పిన్న వయస్కురాలిగా రికార్డుల్లోకెక్కింది గతంలో ఈ రికార్డు సాధించిన పదకొండేళ్ళ విక్కీ వాన్‌మెటర్‌కు పదకొండేళ్ళు కాగా రాచెల్ ఆ రికార్డును అధిగమించింది. రాచెల్‌కు ఈ ప్రయాణానికి పది రోజులు పట్టింది.*

*వృత్తిరీత్యా పైలట్ అయిన రాచెల్ తండ్రి జిమ్మీ ఆమెకు ఏడో సంవత్సరం నుంచి విమానం నడపడంలో శిక్షణ ప్రారంభించాడు*

*—'ఈనాడు' సౌజన్యంతో*

"సుదీర్ఘకాలం వేదన అనుభవించిన హృదయాల గాఢమౌనం నుండి పృథుత్వం ఉద్భవిస్తుంది - సంతోషం మధ్య నుంచి కాదు."

కొన్ని ఆవులు 1.5 మీటర్ల ఎత్తునున్న కంచెను కూడా దాటి వస్తాయి. అపాయకర వేళల్లో ఆవులు గంటకు 40 కి.మీ.ల వేగం వరకు పరిగెత్తగలవు. రష్యాలో ఒక సర్కస్ ఫీట్‌లో చిన్నారి ఆవులు ఫుట్‌బాల్ ఆడుతాయి స్కూటర్లపై పరుగుపందెం జరుపుతాయి మరియు ఒక "బాలెట్" (నృత్య ప్రదర్శన) నిర్వహిస్తాయి.

ఆవుల కీచుస్వరం విసుగు గొల్పుతుంది తన దూడతో సంభాషించేందుకు అది తన గొంతుకను పెంచుతూ, తగ్గిస్తూ వివిధ రకాల స్వరాలు ఉపయోగిస్తుంది వీటిని దూడ పూర్తిగా అర్థం చేసుకుంటుంది.

ఆవు-లయను బట్టి సంగీతాన్ని గమనించ గల్గుతుంది. సంగీతం బిగ్గరగా లేకపోతే ఆవులు ఆ సంగీతం వస్తున్న మూల స్థానం దగ్గరకు కూడా వచ్చి వింటాయి. గడ్డి బీడులో చెల్లా చెదరుగా ఉన్న పశువుల్ని మంద కట్టేందుకు అనేమంది పశువుల కాపరులు ఆవుల ఘ్రాణ శక్తిని ఉపయోగించుకుంటారు

తనకు కొత్తగా కనిపించే దేనినైనా ఆవు అత్యంత గమనికతో, ఆసక్తితో, చూస్తుంది దాని నరాల పద్ధతి సులభంగా ఉద్రేకింప చేసేదిగా ఉంటుంది.

ఆవుల సొంత చావళ్ళు చిన్నవైనా, అక్కడ అవి ప్రశాంతంగా ఉండే విధంగా రూపొందుతాయి. కొత్త చోటుకు తరలగానే - కేవలం ఇంటి ప్రక్కకైనా సరే - లేదా - ఆవుకు కొత్త ఇరుగు పొరుగులు వచ్చినా - దాదాపు 10 శాతం పాలదిగుబడి తగ్గిపోతుంది. ఉదయం లేదా మధ్యాహ్నం వేళల్లో కాక సాయంకాలాల్లో మార్పు జరిగినట్లయితే ఆవు ఈ అదురు నుంచి నిలద్రొక్కుకో గలుగుతుంది. ప్రశాంత పరిస్థితిని పునరుద్ధరించుకునేందుకు ఆవుకు రాత్రి సమయం సహాయపడుతుంది

ఆవుకు కావలసినంత కుడితి లభించకపోతే దాని దిగుబడి ఎన్నటికీ గరిష్టస్థాయి అందుకో లేదు ప్రతిరోజు త్రాగేందుకు 90 నుంచి 130 లీటర్ల నీరు అవసరమౌతుంది. ఇది నమిలి తినేందుకు కావలసిన ఉమ్మినీటి కోసం 80 నుంచి 100 లీటర్ల నీరు అవసరమౌతుంది పొడుగైన నీళ్ళ తొట్టిని నిర్మించి ఆవు అదుర్దాపడకుండా నీటిని త్రాగేందుకు దోహదం చేయాలి

## ఎలా?

### భయంవల్ల వణకటం ఎందుకు?



భయం వల్ల వచ్చే అపాయం నుంచి పారిపోవాలని సిద్ధమౌతున్నప్పుడు భయం యొక్క భౌతిక లక్షణాలు వెలికి వస్తాయి. పారిపోయేందుకు ఉపయోగపడే శరీరపు భాగాలన్నిటికీ అదుపు చేసే మెదడు కణాలలో నరాలకు సంబంధించిన బలం వేగంగా త్రోసుకుపోతుంది ఈవిధంగా పొర్లి ప్రవహించిన శక్తి పొరుగున ఉన్న మెదడు జీవకణాలలోకి చేరి వణకటం, వళ్ళు కొరకటం మరియు ఆకస్మిక నరాల దుర్బలత్వం చేకూరుసుంది.

"గొప్ప సాహసకార్యాలకు ప్రారంభం తరచుగా స్వల్ప అవకాశాలే."
— డెమసనీ

అందరి అభిమానం పొందని పంది కథ ...రు విన్నారా?

తన మరణానంతరం తన యావదాస్తిని, ...ంపదను దానధర్మాలకు విడిచిపెట్టినప్పటికీ ...జలు తనను పిసినారిగానే పిలుస్తున్నారని ...క భాగ్యవంతుడు ఒక పూజారికి ఫిర్యాదు ...శాడు. అప్పుడు ఆ పూజారి ఆ ధనికునికి ...ప్పిన కథ ఇది.

పూజారి ఇలా చెప్పసాగాడు: "ఒక చిన్న ...థ చెబుతాను, వినండి వెనుకటికి ఒక ...ంది తనకు కీర్తి రాలేదని ఒక గోవు వద్ద ...ర్యాదు చేసింది ప్రజలు ఎప్పుడూ ఆవును ...రించి చక్కగా చెప్పుకుంటారే గాని తనను ...రించి ఒక్క మంచి మాట అయినా పలకరని ... పంది విసుగు చెందింది. తాను ఏమి ...సినా, తాను ఎక్కడికి వెళ్ళినా ప్రజాదరణ ...భించలేదు."

"నిజమే, మీ గోవులు పాలు, మీగడ అంది ...్తున్నాయి. కానీ వరాహాలమైన మేము కూడా ...ంకా ఎక్కువే ఇస్తున్నాము గదా! మేము ...ప్పు వేసిన పంది మాంసం, తొడలు, బిరుసైన ...ాట్టి వెంట్రుకలు అందిస్తున్నాము."

తన విలువను ప్రజలు ఎందుకు గ్రహించి ...చ్చుకోవటం లేదో తెలుసుకోగోరుతున్నానని ...ంది అడుగగా గోవు ఆలోచించి ఇలా ...ప్పింది.

"బహుశా నేను బ్రతికి ఉన్నప్పుడే వీటిని ...వ్వటం దీనికి కారణం కావచ్చు. నీవు చని ...యిన తరువాతనే ఇస్తున్నావు."

"ఇది మీకు కూడా వర్తిస్తుంది" అని ...ాజారి కథ ముగించాడు.

మనలో చాలామంది ఇలాగే చేస్తుంటాము. మనం చడ్డీలు, ఆటవస్తువులు, బొమ్మలు మరియు పుస్తకాలు దాచిపెడతాము. వీటిని జాగ్రత్తగా ఒక పెట్టెలో భద్రపర్చి అటకపైన దాచి పెడతాము. వాటికి అక్కడ విలువ ఏమీ ఉండదు, తరచుగా చెదలు ధ్వంసం చేస్తుంటాయి. మనం వీటిని ఉపయోగించటమో, దాపరికం చేయకుండా ఇతరులకు ఇవ్వటమో చేస్తే మనకు ఎక్కువ ఫలితం దక్కుతుంది. మనం గోవును దృష్టాంతంగా పెట్టుకుని, మనం బ్రతికి ఉండగానే ఇవ్వటం అమలు జరపాలి

## విజయ సూత్రాలు


ALBERT EINSTEIN

ఏ = ఎక్స్+వై+జడ్
ఏ = విజయం
ఎక్స్ = పని
వై = ఆట
జడ్ = నోటిని అదుపులో పెట్టుకోవటం

— ఏ. ఐన్‌స్టైన్

"స్వల్ప మర్యాదలు జీవితాన్ని మధురం చేస్తాయి;

# పిల్లలు - ప్రేమ

మనిషికి మనిషి అవసరం ఉంది. మనిషికి ఆహారం, .నీళ్ళు ఎంత అవసరమో సాటి మనిషి యొక్క గుర్తింపు కూడా అంతే అవసరం



ఇంకొకరు అతణ్ణి పట్టించుకోకపోతే, ప్రేమతో పలకరించకపోతే, లాలించకపోతే తాను ఎవ్వరికీ పనికి రాననుకుంటాడు. అతనికి జీవితమే 'నిస్సారమౌతుంది. అతడిలో అభద్రతాభావం (Inferiority feeling) చోటు చేసుకుంటుంది. చివరికి అతడు మానసిక వ్యాధికి లోనౌతాడు.

కనుక ప్రేమ చాలా గొప్ప వైద్యం. ఈ ప్రేమ కరువైంది కనుకనే ప్రపంచం ప్రస్తుతం ఇలా ఉంది. ప్రేమమయమైన ప్రపంచానికి నిజానికి వైద్యం అవసరం లేదు. ప్రేమతో పలికే ఒకమాట, ఒక చూపు చాలు. తృప్తిపడి మళ్ళీ పసివాడౌతాడు. అతడి అహంకారం కరిగిపోతుంది.

మనకు మన పిల్లలపై ప్రేమ ఉంటే సరిపోదు. అది ప్రకటించడం కూడా అవసరమే. పిల్లల పోషణలో బలం ఆహారంలో మాత్రమే లేదు. విటమిన్లు, ప్రోటీనులు కలిగి ఉన్న పౌష్టిక ఆహారం ఈ శరీరాలకు ఎంత అవసరమో వారి మనస్సులకు ప్రేమ అంత అవసరం. స్థూలంగా మన పిల్లవానికి అన్నీ సమకూర్చినా ప్రేమ ప్రకటించకపోతే అతడి పెరుగుదల ఆగిపోతుంది.

ఆస్ట్రేలియాలోని ఒక జూలో ఒక ఆశ్చర్య కరమైన విషయం జరిగింది. మూడు పిల్లలు పుట్టిన తర్వాత ఒక ఆడ చింపాంజీ చని పోయింది. పాల సీసాలతో పాలు పడదా మంటే ఆ పిల్లలు త్రాగటం లేదు. అందుకని "రోబోట్సు' (యంత్ర మానవులను) తయారు

## రంగులపై ఆంగ్లేయుల భావాలు

| | | |
|---|---|---|
| నీలవర్ణం | - | నిజం |
| ఆకుపచ్చ | - | వదిలివేయటం |
| పసుపు రంగు | - | అసూయ |
| తెలుపు | - | ప్రేమ |
| ఎఱుపు | - | ధైర్యంతో ఎదిరించే గుణం |
| నలుపు | - | మృతి |

## రాబోయే సంతతికి బహుమతులు - గ్రంథాలు

*గొప్ప ప్రతిభాశాలురు మానవాళికి వంశపారం పర్యావు ఆస్తిగా విడిచి వెళ్ళేవే గ్రంథాలు ఇంక జన్మించని వారి కోసం, రాబోయే సంతతి కోసం ఇవి బహుమతులుగా ఒక తరం నుండి మరి తరానికి అందించబడుతున్నాయి.*

— జోసెఫ్ అడిసన్

"మీకు సమస్యలు లేనట్లయితే, పెరుగుదలకు ఒక అవకాశాన్ని మీరు కోల్పోయినట్లే."

కంపెనీ వారి ద్వారా ప్రత్యేకంగా ఒక చింపాంజీని (బొమ్మను) తయారు చేయించారు. అది చక్కగా కదిలేది. పిల్లలకు స్తన్యం ఇచ్చేది. క్రమంగా ఆ పిల్లలు ఎద్దగడం మొదలు పెట్టాయి.



అయితే ఈ చింపాంజీ పిల్లలు పెట్టి చని పోయిన రోజే ఇంకొక బోనులో వేరొక చింపాంజీ రెండు పిల్లలను పెట్టింది. క్రమంగా ఈ ఐదు పిల్లలూ పెరుగుతున్నప్పటికీ, తల్లిలేని పిల్లల కన్నా బ్రతికున్న తల్లి యొక్క రెండు పిల్లల శారీరక పెరుగుదల ఉన్నతంగా ఉండటమే కాక, అవి ఎంతో ఉత్సాహంగా ఆటలాడేవి. వాటిపైన పరిశోధన చేసిన మనస్తత్వ శాస్త్రజ్ఞులు ఈ పిల్లల పెరుగుదలలోని భేదానికి కారణం కేవలం తల్లి ప్రేమేనని నిర్ణయించారు

ఎంతమంది తల్లిదండ్రులు తమ పిల్లలపై ప్రేమను ప్రకటిస్తున్నారు? మాటలలో కాక పోయినా చూపులతో, చేష్టలతో, హావభావములతో నయినా తమ పిల్లలపై ప్రేమ ప్రకటించడం ఎంతో అవసరం. అప్పుడే వారిలో మీరు సంపూర్ణమైన వికాసం చూడగలరు.

— "అరణ్య స్పందన" సౌజన్యంతో

క్విజ్:1 (డి) మహారాష్ట్ర, 2 (సి) కేరళ, 3 (సి) 1952, 4 (డి) చెఱకు, 5 (సి) నెమలి, 6 (ఎ) వరి మరియు గోధుమ, 7 (బి) ఎస్ హెచ్ ఎఫ్ జె. మానెక్ షా, 8 (డి) పుష్పాలంకరణ ఏర్పాటు.

**మాటల మహిమ:** 1 (ఎ) ఇల్లు, (బి) తెగ, (సి) లక్ష్యము/ప్రోగు, (డి) పరమాత్మ, 2 (బి) వేసవి, (సి) వేడిమి, (డి) చెమట, 3 (ఎ) పిఱుదు, (సి) మొల/మూపు, (డి) కొండనడుము/దరి, 4 (ఎ) తిరస్కారము, (బి) ఆక్షేపము, (సి) పథము, (డి) ఉమియుట, 5 (ఎ) ఆకాశము, (బి) శ్రావణ మాసము, (సి) మేఘము/వర్షాకాలము, (డి) ముక్కు; 6 (ఎ) తామర, (బి) బాణము, (డి) బాణపు ములికి, 7 (ఎ) వేదము, (బి) అంగడివాడ (సి) పట్టణము/మార్గము, 8 (ఎ) ముక్తి, (బి) నాశము, (సి) సుఖము, (డి) నీళ్ళలో మునిగినది (ఏనుగు)

**తెలివికి పరీక్ష:** 1 బాక్టీరియాను తొలగించేందుకు పాలను 62 డిగ్రీల సి వరకు వేడి చేయటాన్ని పాశ్చరైజేషన్ అంటారు, 2 187, 3 నైఋతి ఋతుపవనాలు, జూన్, సెప్టెంబర్ మాసాల్లో వచ్చే నైఋతి పవనాల వల్ల ఆంధ్ర ప్రదేశ్‌లో ఎక్కువ వర్షపాతం ఉంటుంది, ఈశాన్య ఋతు పవనాల వల్ల నవంబర్, డిసెంబర్ మాసాల్లో రాష్ట్రంలో వర్షం కురుస్తుంది, 4. కలకత్తాలో, 1905 లో ఎల్ఫిన్‌స్టన్ పిక్చర్ పాలెస్ నిర్మాణం జరిగింది, 5 నెల్లూరు జిల్లాలో ఉన్నది. ఇది తమిళనాడు సరిహద్దు ఆనుకుని ఉన్నది, 6. శ్రీమతీ భానుమతీ రామకృష్ణ, "నాలో నేను."

# ..రిని గురించి తెలుసుకోండి

ముఖ్తర్ అహ్మద్ అన్సారి (1880 - 1936)· ఢిల్లీలో ప్రజాదరణ పొందిన వైద్యుడు. హోమ్ రూల్ ఉద్యమంలోని ఒక ప్రధాన నాయకుడుగా పేరు తెచ్చుకున్నారు స్వాతంత్రోద్యమ సమయంలో అనేకసార్లు కారాగారవాస శిక్ష అనుభవించారు పార్లమెంటరీ కార్యక్రమాన్ని కాంగ్రెస్ ఆమోదించేందుకు బాధ్యత వహించారు



జార్జి ఈస్ట్‌మన్ (1854 - 1932): ఒక అమెరికన్ ఆవిష్కర్త. మొట్టమొదటి ఫోటోగ్రఫిక్ ఫిలింను పేటెంట్ (సర్వహక్కులు పొందటం) చేసుకున్నారు. (మొదట్లో కాగితం, తరువాత సెల్యులాయిడ్, ఆఖరికి సెల్యులోజ్ అసిటేట్) వీటినుంచి తయారు చేసిన ఫోటోగ్రఫిక్ ఫిలిం మరియు కోడక్ కెమెరాను పేటెంట్ చేసుకున్నారు.

ఎస్. శ్రీనివాస అయ్యంగార్ (1874 - 1941)· రామనాథపురంలో జన్మించారు న్యాయవాద వృత్తి చేపట్టారు. న్యాయవాదుల సంఘం నాయకుడుగా పెంపొందారు. 1916లో మద్రాసు అడ్వొకేట్ జనరల్‌గా నియమించబడ్డారు. 1926లో కేంద్రశాసన సభా సభ్యుడై, ప్రతిపక్ష ఉప నాయకుడుగా ఎన్నికయ్యారు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, న్యాయం కోసం ఎల్లప్పుడూ పాటుపడ్డారు ప్రజాహిత రంగంలో లౌకిక విధానాన్ని సమర్థించారు.

అసఫ్ అలీ (1888 - 1953): ఉత్తర ప్రదేశ్‌కు చెందిన ఒక ఉన్నత కుటుంబంలో జన్మించారు ఇంగ్లండ్‌లో న్యాయశాస్త్రం అభ్యసించి, ఢిల్లీలో న్యాయవాద వృత్తిని చేపట్టారు. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని కారాగార క్లేశం అనుభవించారు. వాషింగ్టన్‌లో మొదటి భారత రాయబారిగా పని చేశారు.

ఈసప్: 6వ శతాబ్ది బి.సి.లో గ్రీస్‌లో నివసించాడు. అనేక సుప్రసిద్ధ నీతి కథలను సమకూర్చాడు ఈ కథలు సత్ప్రవర్తన లేదా నీతి పాఠాల బోధనకు ఉపయోగించబడుతున్నాయి.

డబ్ల్యు.సి ఫీల్డ్స్ (1879 - 1946) ప్రసిద్ధి చెందిన చలన చిత్ర హాస్య నటులలో ఒకడు. ఆకర్షణ గల సినిమా నటి యేవెస్ట్‌తో ఎన్నో సుప్రసిద్ధ చిత్రాలు నిర్మించాడు. "డేవిడ్ కాపర్‌ఫీల్డ్" (1934)లో మిస్టర్ మికాబర్ పాత్ర పోషణకు చిత్ర విమర్శకుల ప్రశంసలు పొందాడు

లాలా లజపతి రాయ్ (1865 - 1928): భారత జాతీయ కాంగ్రెస్‌కు చెందిన సమరశీల నాయకులలో ఒకరు. 1920లో ప్రప్రథమ జాతీయ కార్మిక సంస్థ అయిన ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ (ఏఐటియుసి)ని స్థాపించారు. 1928 అక్టోబర్ 30న సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా జరిగిన ప్రదర్శనకు నాయకత్వం వహించారు

"ఒక పసిబిడ్డ-వంటి హృదయాన్ని కోల్పోనివాడే - గొప్ప వ్యక్తి."

# పెద్దవాళ్ళను పేరుతో పిలవరు

కె. సుబ్రహ్మణ్యన్

ఒక సగటు భారతీయుడు తనకంటే పెద్దవారిని పేరుపెట్టి పిలవడు. వారిని సాధారణంగా 'మామ' అనో, 'అత్త' అనో పిలుస్తారు. పెద్ద వారైన స్త్రీలను 'అమ్మ' అనీ, 'అక్క' అనీ సంబోధిస్తారు ఇద్దరు వ్యక్తులు కలుసుకున్నప్పుడు వారు ఏవిధమైన పరిచయం లేకుండానే సంభాషణ ప్రారంభిస్తారు. ఒకరిపేరు మరొకరికి చెప్పుకోవటం కూడా అవసరం రాదు వ్యక్తి పేరు తెలుసుకోకుండానే రైళ్ళల్లో, బస్సుల్లో రెండు నుంచి మూడు గంటలపాటు ఉత్సాహ భరితమైన సంభాషణ కొనసాగిస్తుంటారు



తనను పేరుపెట్టి విద్యార్థులు పిల్చినప్పుడు సగటు ఉపాధ్యాయుడు ఎంతో నొచ్చుకుంటాడు. చిన్నవారిని పేరుపెట్టి పిలిచే ప్రత్యేకాధికారం పెద్దలకు ఉన్నది.

ఒక సగటు భారతీయుడు తన భార్యను పేరుపెట్టి పిలవడు. అదేవిధంగా భార్య కూడా భర్తను పేరుతో పిలవదు. భర్త తన భార్యను పిలవాలనుకుంటే 'నీవు వినాలి' (లేదా) 'ఏమిటి?' (లేదా) 'వింటున్నావా?' (లేదా) అటువంటి మాటల్ని ఉపయోగిస్తాడు.

విద్యాధికులై ఉండి, నగరాల్లో నివసించే వారు సామాన్యంగా తమ భార్యల్ని పేరుతోనే పిలుస్తారు. అయితే అధునాతన పురుషులు కూడా తమ తల్లిదండ్రులతో మాట్లాడేటప్పుడు "నాభార్య" అని చెప్పరు. వారు తమ పిల్లల పేర్లు చెబుతారు. ఉదాహరణకు: 'రాము తల్లి' అనో, 'మీ కోడలు' అనో చెబుతారు. తన అత్తమామల ముందు భార్య కూడా 'నా మొగుడు' అని చెప్పదు దీనికి బదులు 'మీ కుమారుడు' అనో, ఏదో ఒక బిడ్డపేరు చెప్పి ఆబిడ్డ తండ్రి అనో చెబుతుంది

గ్రామాలలో ఈనాటికీ భర్తపేరు చెప్పటం నిషేధించబడింది. కనుక జనాభా గణన సమయంలో భర్త ఇంట్లో లేకపోతే, భార్య నుంచి అతని పేరు రాబట్టటం ఎంతో దుర్లభమౌతున్నది. ఆ పేరు కోసం జనాభా సేకరణ ఉద్యోగి ఇరుగు పొరుగు వారి దగ్గరకు వెళ్ళవలసి వస్తున్నది.

విద్యాధికులైన భారతీయులు తమ 'భార్య' విషయం ప్రస్తావించవలసి వచ్చినవుడు ఇంగ్లీషు మాట 'వైఫ్'ను ఇంగ్లీషులో లేదా తమ మాతృభాషల్లో ఉపయోగిస్తారు. ఇంగ్లీషు మాట ప్రయోగించేందుకు వారు అసౌకర్యానికి లోనుగారు, కానీ తమ మాతృ భాషల్లో దానికి సమానమైన మాట ఉపయోగించేందుకు మాత్రం అసౌకర్యంగా తలుస్తారు.

— "ఆంత్రోపలాజికల్ లింగ్విస్టిక్స్" సౌజన్యంతో

"ఏ మనిషి కూడా ఇద్దరు యజమానులకు సేవ చేయలేడు; ఎందు కంటే అతడు ఒకరిని ద్వేషిస్తాడు, మరొకరిని ప్రేమిస్తాడు. లేదా